# చందమామ



సంపుటి 104 ఫిబ్రవరి 2001 సంచిక 2

ఈ సంచికలో...



ఈ నెల విశేషాలు



సాయం- సంతోషం (బేతాళ కథలు)

యక్ష పర్వతం





భారత సంస్కృతి చరిత్ర

అజేయుడు గరుడుడు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
New 82 (Old 92), Defence Officers Colony,
Ekkatuthangal, Chennai - 600 097.


సంపాదకుడు
విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
కొత్త నం.82 (పాత నం.92)
డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
ఇ.మెయిల్: Chandamama@ vsnl.com


అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్, ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# నూతన సహస్రాబ్దిలో చందమామ!

ఈనాటి పాఠకులు చాలామంది చందమామ ప్రారంభమైన రోజులు ఎలా ఉండేవో ఊహించలేరు. స్వాతంత్ర్య సాధనకు దేశం ఆయత్త మవుతూన్న కాలఘట్టం అది. టీవీ లేదు; కంప్యూటర్ లేదు; ఇంటర్ నెట్ లేదు; ఆధునిక ముద్రణా సౌకర్యాలు లేవు. చేత్తో ఒక్కొక్క అక్షరంగా కంపోజ్ చేసి కథలను ముద్రించే కాలం!

ప్రస్తుతం ముద్రణారంగంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. మీ తాతలు, తండ్రులు చదివిన రోజులకన్నా ఇవాళ చందమామ ఆకర్షణీయంగా ఉందని భావిస్తున్నాము. అక్కడితో ఆగిపోకుండా చందమామ నూతన తీరాలకేసి దృష్టి సారిస్తోంది. ఇప్పటికే చందమామ పలు దేశ విదేశ పత్రికలకూ, వార్తాపత్రికలకూ భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను తెలియజేసే శీర్షికలను అందజేస్తోంది. తన సాహితీ సంపదలను టీవీల ద్వారా ప్రసారం చేయడానికి సమాయత్తమవుతోంది. ఆదర్శ జీవితానికి కావలసిన ఉన్నతమైన విలువలను విశదీకరిస్తూ, అర్ధశతాబ్దానికి పైగా చందమామలో వెలువడి పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్న ''పరోపకారి పాపన్న కథలు'' హైదరాబాదు దూరదర్శన్ కేంద్రంద్వారా ఈ నెల నుంచి ప్రసారం కానున్నాయి. తక్కినవి కూడా వివిధ ఛానెల్స్‌లో వివిధ భాషలలో క్రమంగా ప్రసారం అవుతాయి.

ఆరోగ్యకరమూ, ప్రయోజనాత్మకమూ అయిన జీవితం సాగించడానికి కావలసిన విజ్ఞాన వినోదాలు విరజిమ్మే విషయాలను పాఠకులకు అంద జేయాలన్న ఆశయాన్ని కొనసాగిస్తూ; విజ్ఞాన, సాంకేతిక రంగాలలో కాలానుగుణంగా వస్తూన్న అభివృద్ధిని సద్వినియోగం చేసుకోవడానికి చందమామ సంసిద్ధంగా ఉన్నది!



## ఏకధాటి ఉపన్యాసం !



ఒక విషయం గురించి నాలుగైదు నిమిషాలు మాట్లాడాలంటే ఎంతకష్టమో వక్తృత్వ పోటీల్లో పాల్గొనే విద్యార్థినీ, విద్యార్థులకు బాగా తెలుసు. అయితే, తమ వాదాలు వినిపించడానికి ఈ ఐదు నిమిషాలు చాలవు,మరింతసమయం కేటాయించాలని భావించే వాళ్ళూ లేకపోలేదు. చెన్నయ్ (మద్రాసు)నగరంలో ఇటీవల వక్తృత్వ పోటీలో కాదు గానీ- తమిళ నాడులోని తేనీ జిల్లా నుంచి వచ్చిన ఇరవై యేడేళ్ళ కాశినాధన్ 'ఈ నాటి సమాజంలో మహిళల స్థానం' అన్న విషయం గురించి ఏకధాటిగా ఉపన్యసించాడు. నవంబర్ 3వ తేదీ ఉదయం పది గంటలకు ఆరంభించిన ఉపన్యాసాన్ని మరునాడు సాయంకాలం నాలుగు గంటలకు ముగించాడు. అంటే, ముప్పై గంటల సేపు ఏకధాటిగా అదరగొట్టాడన్నమాట! గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో తన పేరు చూసుకోవాలన్నది అతని కోరిక. ఒకే విషయం మీద 24 గంటల సేపు ఏకధాటిగా మాట్లాడి న్యూజిలాండుకు చెందిన మైకేల్ మోరల్ (64) సృష్టించిన రికార్డును కాశినాధన్ అధిగమించాడు. కాశినాధన్ ఉపన్యాసాన్ని వినడానికి మద్రాసు హైకోర్టు న్యాయమూర్తితో సహా పలువురు ప్రముఖులు సభకు హాజరయ్యారు.

## అంధులఉద్యానం!



చూపులేని వాళ్ళకు నూతన సంవత్సరారంభంలో మనదేశం ఒక కానుక ఇచ్చింది. జాతీయ వృక్ష పరిశోధనా సంస్థ (ది నేషనల్ బొటానికల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్) అంధుల కోసమని లక్నోలో ఒక ప్రత్యేక ఉద్యానవనాన్ని ప్రారంభించింది. అక్కడికి వచ్చే అంధులు పూలవాసన చూడడమే కాదు. ఆ మొక్కల గురించీ, పూల గురించీ, పళ్ళ గురించీ (బ్రెయిలీలో) హాయిగా చదువుకోవచ్చు. వాటి వివరాలు వాళ్ళ సౌకర్యం కోసం అనుకూలమైన ఎత్తులో అమర్చబడివున్నాయి. అంతే కాదు; మొక్క(ల)కు దాపుల అమర్చిన టెలిఫోన్‌ను అందుకుంటే- వాటిని గురించి రికార్డు ద్వారా మరిన్ని విషయాలను తెలుసుకోవచ్చు. చక్రాల కుర్చీలలో వచ్చేవాళ్ళు ఒక చోటునుంచి మరొక చోటికి సులభంగా వెళ్ళవచ్చు. ఈ రకం పార్కుల్లో ప్రపంచంలోనే ఇది మొదటిది కావడం చెప్పుకోతగ్గ విశేషం!

# తాజ్‌మహల్ మాయమయిందా?



అవును! మాయమయిందనే కఛ్‌పురా ప్రజలు భయపడ్డారు. కఛ్‌పురా యమునానదికి ఆవలి తీరంలో ఉన్నది. అక్కడి నుంచి 400 మీ॥ దూరంలో యమునానది ఆవలి తీరంలో ఉన్న తాజ్‌మహల్ స్పష్టంగా కనిపిస్తుంది. సుప్రసిద్ధ ఐంద్రజాలికుడు పి.సి.సర్కార్ జూనియర్ — తన మాయాజాలంతో తాజ్‌మహల్‌ను మాయం చేస్తానని పట్టణంలో కరపత్రాలు పంచాడు. ఆ వింతను చూడడానికి ప్రజలు గుమిగూడారు. పి.సి.సర్కార్ జూనియర్ తన మాయాజాల ప్రదర్శనను నవంబర్ 8వ తేదీ మధ్యాహ్నం ప్రారంభించాడు. నిజంగానే తాజ్‌మహల్ మాయమవుతుందా అని ప్రేక్షకులు కుతూహలంతో ఎదురుచూడసాగారు. అవును, అతడు చేసి చూపాడు. వెయ్యి జతల కళ్ళు ఆ పాలరాతి కట్టడాన్ని ఉత్కంఠతతో చూస్తూండగా అది వాళ్ళ కళ్ళనుంచి మరుగయింది. ఐంద్రజాలకుడి కుమార్తె మేనక మరో రెండు నిమిషాలలో దానిని మళ్ళీ యథాస్థానంలో కనిపించేలా చేసింది. దీనిని గురించి పి.సి.సర్కార్ జూనియర్ మాట్లాడుతూ, "ఇంద్రజాలవిద్యలోని అదృశ్య రసాన్ని ఇందులో నేను ఉపయోగించాను," అన్నాడు.

# 'అబాకస్' నుంచి 'అన్జాన్' వరకు...




జపానుదేశం క్యోటోలో అక్టోబర్ 31 వ తేదీ ఒక లెక్కల పోటీ జరిగింది. 992.587318ని 5,647.723తో విభజించమని సమస్య ఇచ్చారు. కాల్కులేటర్లు, కంప్యూటర్లు ఉపయోగించకూడదు. ఆఖరికి 'అబాకస్' సాయం కూడా లేదు. అయినా కొందరు ఊహలలోనే 'అబాకస్' పూసలను కదిలించసాగారు. మనసులో లెక్కలు వేసుకుంటూ కొందరు బుర్రబద్దలు కొట్టుకోసాగారు. అంతలో పదమూడేళ్ళ హిరోకిత్సుచియా చేయి పైకెత్తాడు. అనుమతి లభించగానే గబగబా లేచివచ్చి బోర్డు మీద: 0.17575000132796881150155558266 58 అని రాశాడు. అవును! అదే సరైన సమాధానం. ఈ లెక్క వేయడానికి అతడు 'అన్జాన్' పద్ధతిని అనుసరించాడు. చైనాలో ప్రారంభమైన 'అబాకస్' జపానుకు క్రీ॥శ॥ 1500 సం॥లోనే పరిచయమయింది. అబాకస్‌లో లెక్కలు వేయడానికి లోహపుతీగలకు అమర్చిన పూసలను ముందుకూ, వెనక్కూ కదిలించవలసి వుంటుంది. దీనిని ఉపయోగించిన నిపుణులు కొందరు పూసలను భౌతికంగా కదిలించడానికి బదులు మరొక సులభమార్గాన్ని కనుగొన్నారు. అబాకస్‌ను మనసులోనే ఊహించుకుని పూసలను కదిలిస్తూ లెక్కలు గణిస్తారన్నమాట. దీనినే 'అన్జాన్' అంటారు. కాల్కులేటర్లూ, కంప్యూటర్లూ వెనకబడే రోజులు వస్తాయో, ఏమో మరి!

### కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువ ఇవ్వబడింది. ఆసక్తికరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

రాజు సూర్యదేవుడికి కొత్త మంత్రిని నియమించ వలసివచ్చింది. రాజు సలహాదారులలో మంత్రమూర్తి సమర్థుడూ,విశ్వాసపాత్రుడూ గనక అతడే ఆ పదవికి అర్హుడని రాజు భావించాడు.ఆ విషయం రాణికి చెప్పాడు. ''మన విశ్వబంధు, మంత్రమూర్తికి ఏ విషయంలోనూ తీసిపోడుకదా? అతన్నెందుకు మంత్రిగా నియమించకూడదు?'' అన్నది రాణి. విశ్వబంధు ఆమె దూరపుబంధువు.

''అతని సామర్థ్యం గురించి అనుమానం లేదు కానీ, అవకాశం వచ్చినప్పుడు దానిని పరీక్షించడం మంచిది,'' అన్నాడు రాజు.

సరిగ్గా ఆ సమయంలోనే రాజుకు ఒక సమస్య ఎదురయింది. రాజధానీ నగరంలోని ధనికవర్తకుడైన వీరబాహుకు ఒక్కగానొక్క కూతురు. అందాల భరిణ అయిన ఆమెను వివాహమాడడానికి ముగ్గురు యువకులు ఒక్కసారిగా వచ్చారు. ఆ ముగ్గురిలో ఆమెకు తగిన వరుడెవరని వీరబాహు నిర్ణయించలేకపోయాడు. అందువల్ల వారి ముగ్గురినీ తమ కులగురువు వద్దకు పంపాడు.

గురువు ఆ ముగ్గురినీ ఒకసారి పరిశీలనగా చూసి, కళ్ళు మూసుకుని కొంతసేపు ధ్యానంలో గడిపాడు. ఆ తరవాత లేచి కుటీరం లోపలికి వెళ్ళి, మట్టితోనూ, నీళ్ళతోనూ, ధాన్యంతోనూ నిండిన మూడు శంఖాలను తెచ్చి ముగ్గురు యువకులకూ తలా ఒకటి ఇచ్చి వీరబాహువద్దకు తిరిగివెళ్ళమని చెప్పాడు.

వాళ్ళను చూడగానే వర్తకుడు విస్మయం చెందాడు. తమ గురువు సూచించిన వరుణ్ణి కనుగొనలేకపోయాడు. కాబట్టి ఆ ముగ్గురినీ రాజు సమక్షానికి తీసుకువెళ్ళాడు.

మంత్రమూర్తి, విశ్వబంధులను పరీక్షించడానికి రాజు దీనిని ఒక అవకాశంగా భావించాడు. ఇద్దరినీ రప్పించి, వీరబాహు సమస్యను పరిష్కరించే బాధ్యతను వాళ్ళకు అప్పగించాడు.

ఈ సమస్యను వాళ్ళిద్దరూ ఎలా పరిష్కరించ గలిగారు? వాళ్ళ నిర్ణయాన్ని వీరబాహు అంగీకరించాడా లేదా?ఎవరి నిర్ణయాన్ని అంగీకరించాడు? దానిద్వారా రాజు ఆ ఇద్దరినీ ఎలా పరీక్షించ గలిగాడు?ఆయన సమస్య ఎలా తీరింది?

ఈ విషయాలను తెలియజేస్తూ కథను పూర్తి చేయండి. మీరు చూపే పరిష్కారం యుక్తియుక్తంగా ఉండాలి. ముగింపు రాశాక కథకు పేరుపెట్టడం మరిచి పోకండి. మీ ఎంట్రీలమీద 'సృజనాత్మకపోటీకి' అని రాసి, ఫిబ్రవరి 20 వ తేదీలోగా మాకు చేరేలా పంపండి.

## గత సంచిక క్విజ్ సమాధానాలు

1. 1952 జనవరి 26.
2. భారత రాష్ట్రపతి.
3. కేంద్ర రక్షణామంత్రి.
4. విజయ్ చౌక్ నుంచి ఎర్రకోట వరకు.
5. ఇండియా గేట్ వద్ద ప్రధాని పుష్పగుచ్ఛంవుంచే అమరవీరుల స్మారక చిహ్నం 'అమర్ జవాన్ జ్యోతి'.
6. సాహస చర్యలను, అత్యున్నత త్యాగాలను వీరచక్ర, పరమ వీరచక్ర బిరుదులతో భారతరాష్ట్రపతి సత్కరిస్తున్నప్పుడు.
7. ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ నైజీరియా ప్రెసిడెంట్ ఒలూసీసగన్ ఓబశాంజో.
8. వివిధ ప్రాంతాలు వివిధ రంగాలలో సాధించిన ప్రగతిని చూపే ఆయా ప్రాంతాల వాహనాలు నడుస్తాయి.
9. సాహసబాలల అవార్డులు పొందిన పిల్లలు, అలంకరించబడిన ఏనుగులమీద ఊరేగింపుగా వెళతారు.
10. వాతావరణం బావుంటే గగన విహారం.
11. జనవరి 30వ తేదీ జరగనున్న అమరవీరుల స్మారక దినం కోసం జనవరి 29వ తేదీ సాయంకాలం విజయ్‌చౌక్ వద్ద జరిగే 'బీటింగ్ రిట్రీట్'.
12. 1929 డిసెంబర్ 31 తేదీ లాహోర్‌లో జరిగిన 44వ భారత జాతీయ కాంగ్రెస్ 1930 జనవరి 26వ తేదీ స్వతంత్ర దినం జరుపుకోవాలని నిర్ణయించింది. ఆ సమావేశానికి జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షత వహించాడు.




# సాయం - సంతోషం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, శ్మశానంలో తిరుగాడుతూ, ఎవరికి సాయం చేయగోరి నువ్వు ఇన్ని ఇక్కట్లకు గురి అవుతున్నావో అర్థం కావడం లేదు. ఒకవేళ ఎన్నో శ్రమల కోర్చి నువ్వు సాయం చేసినా, చివరకు ఆ సాయం పొందినవాడు నిజంగా సంతోషపడ్డాడా అన్నది, అపరిష్కృత సమస్యలా మిగిలిపోతుంది. ఇందుకు ఉదాహరణగా, ఎంతో మంచితనం, పరోపకారబుద్ధిగల రామన్నఅనేవాడి



కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

రామన్నకు పెద్దగా ఆస్తిపాస్తులు లేక పోయినా తిండికీ, బట్టకూ లోటు లేదు. అతడికి చదువు సరిగ్గా అబ్బలేదు. బొమ్మలు వేయాలనీ, పాటలు పాడాలనీ ఎంతగానో ప్రయత్నించినా ఫలించలేదు. తానెందుకూ పనికిరానివాడినని తరచూ దిగులుపడు తూంటే, తాత అతడినొకసారి దగ్గరకు పిలిచి, "ఒరే, ఈ ప్రపంచంలో గొప్పపనులు చెయ్యడం కన్నా కష్టమైనది మంచితనాన్ని కలిగివుండడం. నువ్వు చాలామంచివాడివికావడం, నీ అదృష్టం. అందుకు సంతోషంగా వుండాలి,'' అంటూ హితబోధ చేశాడు.

"నేను మంచివాడిననడానికి సాక్ష్యమే మిటి?''అన్నాడు రామన్న నిరుత్సాహంతో కూర్చున్నచోటునుంచి కదలకుండా.

తాత నవ్వి, "మంచితనమంటే స్వార్థం, అసూయ, ద్వేషం లాంటివి లేకపోవడం. ఎదుటివారి గొప్పతనానికి సంతోషించడం. ఇతరుల సంతోషం కోసం ప్రయత్నించడం. ఎవరికైనా మేలు జరుగుతుందంటే, స్వప్ర యోజనాన్నికూడా త్యాగంచెయ్యడం.ఇలాంటి లక్షణాలన్నీ నీలో వున్నాయి,'' అన్నాడు.

తాత, తనను గురించి చెప్పాక, "తాతా! మన ఇంట్లోవాళ్ళతో నేను మంచిగా ఉండడం గొప్పకాదు. నా వల్ల ఇతరులకు — అంటే మనింట్లో కాకుండా బయటి వాళ్ళకు ప్రయోజనమేమీ లేదు కదా! కళాకారుడినైతే ఎందరికో మనోల్లాసాన్ని కలిగించి వుండే వాణ్ణి,'' అన్నాడు రామన్న దిగులుగా.

"ఇతరులకు మనోల్లాసం, సంతోషం లాంటివి కలిగించడానికి కళలే అవసరం లేదు. పరోపకారం చెయ్యి!'' అన్నాడు తాత.

ఈ మాటలు బాగా తలకెక్కాయి, రామ న్నకు. అప్పటినుంచే అతడు తనకు చేతనై నంతలో పరోపకారం చేస్తూండేవాడు. కానీ దిగులుమాత్రం తగ్గలేదు!

ఇలా వుండగా — ఒక రోజున వాళ్ళ ఇంటికి, రామన్న మేనమామ వచ్చాడు. రామన్న మంచి యోగ్యుడైన కుర్రవాడని పేరు తెచ్చుకోవడంతో, మారాలోచనలేకుండా అతణ్ణి తన ఇంటి అల్లుణ్ణి చేసుకోవాలన్న ఉద్దేశంతో వచ్చాడాయన. ఆయన కూతురు సీత మంచి అందగత్తె, చాలా వినయం, తెలివితేటలూ. గలది. అలాంటి పిల్ల తమ ఇంటి కోడలవుతుందని ఇంటిల్లిపాదీ సంతో షించారు. కానీ రామన్న మాత్రం తనకసలు పెళ్ళి చేసుకునే ఉద్దేశమే లేదనేశాడు.

ఇందుకు మేనమామ చాలా ఆశ్చర్య పోయి, రామన్నను, "ఎందుకని?" అని అడిగాడు. 'నేనెందుకూ పనికిరానివాణ్ణి. నాకే విద్యలూ రావు," అన్నాడు రామన్న.

"వ్యవసాయం చేస్తున్నావుగదా!" అన్నాడు మేనమామ.

"అందులోమాత్రం, నా తెలివి ఏముంది? నాన్న చెప్పింది చెయ్యడం తప్ప, సొంతంగా నేనేం చెయ్యలేను," అన్నాడు రామన్న.

"అలా అనుకోవడం నీ గొప్పతనం. వ్యవ సాయం ఒక్కరోజులో రాదు. అనుభవం పెరిగితే అంతా నిన్ను గొప్ప వ్యవసాయ దారుడంటారు. అప్పుడు నీక్కలిగే సంతోషం అంతా ఇంతా కాదు," అన్నాడు మేనమామ.

"నాకు సంతోషమా?" అంటూ రామన్న, మేనమామకేసి కోపంగా చూసి, "సంతోషంగా వుండడం, నాకు చేతకాదు. నేనేసంతోషంగా వుండలేనప్పుడు, పెళ్ళి చేసుకుని భార్యను సంతోషపెట్టగలనా?" అన్నాడు.

ఈ మాటలకు మేనమామ అప్పటికేం మాట్లాడకుండా, రెండురోజులపాటు రామన్న దినచర్యను గమనించాడు. తర్వాత ఆయన ఆ ఊళ్ళో తనకున్న కొన్నిపనులు ముగించు కుని, తిరుగుప్రయాణమవుతూ, "రామన్నా! నువ్వు నాతో మాఊరికిరా. నిత్య సంతోషిగా వుండే మార్గం చెబుతాను," అన్నాడు.

రామన్న అందుకు సరేనన్నాడు. మేన మామతో కలిసి వాళ్ళ ఊరు వెళ్ళాడు.

సీత చలాకీతనం,సంతోషం ఆమె అందాన్ని రెట్టింపుచేశాయి. ఆమెను చూడగానే రామ న్నకు తనూ అంత సంతోషంగా వుండాలన్న కోరిక పుట్టింది. ఇల్లు చేరి ప్రయాణబడలిక



తీర్చుకున్నాక మేనమామ ఊళ్ళోకి బయలు దేరుతూ, రామన్నతో, 'నేను మీ ఊరినుంచి మా ఊరివాళ్ళకు కొన్ని శుభవార్తలు తెచ్చాను. అవి వాళ్ళకు చెబితే ఎంతో సంతోషిస్తారు. ఇతరుల సంతోషం చూడడం, నీకూ ఇష్టమే కదా! నాతోరా," అన్నాడు.

రామన్న బయల్దేరుతుంటే, తనూ వస్తా నన్నది, సీత. సీతతో కలిసి ఊళ్ళో తిరుగు తూంటే, రామన్నకు చాలా సంతోషంగా వున్నది. అయితే, అది ఎంతోసేపు నిలవ లేదు. ముగ్గురూ కలిసి అలా ఒక సందు మలుపు తిరిగారోలేదో, అక్కడ బాటకు పక్కగా దిగులుగా నిలబడ్డ ఏడెనిమిదేళ్ళ కుర్రాడు కనిపించాడు.సీత వాణ్ణి చూస్తూనే, "ఏమైంది రా, రంగా! అలావున్నావేం?" అని అడిగింది.

"రంగురంగుల నా గోలీ ఇక్కడ తుప్పలో పడిపోయింది. వెదుకుతామంటే లోపలి



నుంచి బుస్సుమన్న చప్పుడు వినిపిస్తున్నది. అక్కడ పామున్నట్టున్నది," అన్నాడు రంగా.

"ఉత్త పిరికిమెధవ్వి! గాలికి ఆకూ ఆకూ రాసుకుంటే, అలా బుస్సుమంటుంది," అని వాడికి ధైర్యం చెప్పిన సీత, తండ్రితో, "నాన్నా! మనం పాపం వీడికి గోలీ వెతికిపెట్టి, తర్వాత వెళదాం," అన్నది.

"నువ్వెప్పుడూ ఇంతే!" అంటూనే తండ్రి ముందుకు నడిచాడు.

రామన్న, మేనమామ కలిసి ఒక ఇంటికి వెళ్ళారు. మేనమామ, ఆ ఇంటాయనతో, "అదృష్టవంతుడివయ్యా! కూతురు పెళ్ళి కుదురుతుందా కుదరదా అని బెంగ పెట్టు కున్నావుగదా! చలపతి నువ్విచ్చే కట్నానికే పెళ్ళికి ఒప్పుకున్నాడు," అని చెప్పాడు.

ఇంటాయన, "మంచి కబురు తెచ్చావు. మరి గణపతి ఏమన్నాడు?" అన్నాడు.

"అబ్బో, ఆయనకు డబ్బాశ ఎక్కువ. నీకు ఏమాత్రం అందుబాటులో లేడు," అన్నాడు రామన్న మేనమామ.

"సరేలే, మనకంతే ప్రాప్తమనుకుందాం!" అన్నాడు ఇంటాయన.

అక్కణ్ణించి ఇద్దరూ మరొక ఇంటికి వెళ్ళారు. అక్కడ ఒక యువకుణ్ణి చూసి, రామన్న మేనమామ, "జీవితంలో నాకు ఉద్యోగం దొరుకుతుందా, అన్నావు గదా! మా మేనల్లుడి ఊళ్ళో జమీందారుగారి చిన్న భార్య పిల్లలకు చదువు చెప్పాలట. ప్రస్తుతానికి నెలకు వంద వరహాలు ఇస్తారు. ఒక ఏడాది పాటు నిన్ను గమనించి, దివాణంలో ఏదో ఒక పనికూడా ఇస్తారు," అని చెప్పాడు.

"జమీందారుగారి పెద్ద భార్యకు దివాణంలో పలుకుబడి ఎక్కువట. ఆవిడ పిల్లలకు చదువు చెబితే, పెద్ద ఉద్యోగానికి అవకాశం వుంటుంది. ఆవిడ పిల్లలకు చదువు చెప్పే వీలు లేదా?" అన్నాడా యువకుడు.

"ఆవిడకు సంస్కృతం వచ్చిన గురువు కావాలట. నీకు సంస్కృతం రాదుగామరి," అన్నాడు రామన్న మేనమామ.

"సరేలేండి. మన కంతే ప్రాప్తమనుకుందాం!" అన్నాడా యువకుడు.

ఇద్దరూ తిరిగి ఇంటికి వెళుతూండగా, తుప్పల్లోంచి గోలీ బయటికి తీసినసీత, దాన్ని రంగాకు ఇస్తూ, "శ్రమైతేనేం, నాన్నా! తుప్పల్లోంచి రంగా గోలీని వెలికి తీశాను!" అన్నది సంతోషంగా.

ఇల్లు చేరాక మేనమామ, రామన్నతో, "మా సీత సంతోషానికి కారణం అర్థమైంది గదా!" అన్నాడు.

వెంటనే రామన్న, "ఇందులో పెద్ద అర్థం కానిదేముంది! గోలీ దొరికినందుకు రంగా సంతోషించాడు ; శ్రమపడి వాడికి సాయం చేసినందుకు సీత సంతోషపడింది. నువ్వు చెప్పిన ఆ పెళ్ళి సంబంధం గురించి, ఇంటాయన ఏమాత్రం సంతోషించినట్టు లేదు. అలాగే, జమీందారుగారి చిన్న భార్య పిల్లలకు చదువు చెప్పే ఉద్యోగం దొరికిన వాడూ సంతోషించినట్టు కనబడలేదు," అన్నాడు.

ఇందుకు వాడి మేనమామ చిన్నగా నిట్టూర్చి, "మనం ఎవరికన్నా అవసరపడినప్పుడు, పరోపకారబుద్ధితో సాయం చేయగలంగాని, దానితోపాటు సంతోషం కూడా ఎలా ఇవ్వగలం?" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రామన్న మేనమామ సాయం-సంతోషాల గురించి తన వాక్చాతుర్యంతో మేనల్లుణ్ణి తృప్తిపరచ ప్రయత్నించాడేమో అన్న సందేహం కలుగుతున్నది. ఒకవేళ అతడికే దీన్ని గురించి సరైన అవగాహన లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రామన్న మేనమామ, ఆయా వ్యక్తుల విభిన్న మనస్తత్వాల గురించిన అవగాహన వున్నవాడు. అంతవరకూ, తన కూతురుకు అసలు సంబంధమే కుదురుతుందా అనుకున్న ఇంటాయన, ఇంకాస్త మంచి సంబంధం దొరికితే బాగుండునను కున్నాడు. అలాగే, తనకు ఉద్యోగం దొరకదనుకున్నవాడికీ, ఉద్యోగం దొరకగానే ఇంకొంచెం మంచి ఉద్యోగం కావాలనిపించింది. అందువల్ల, కేవలం ఇతరులను సంతోషపెట్టడానికి కాక, ఇతరులకు సాయపడాలని మాత్రమే పరోపకారం చేయాలి. మనిషికి సాయాన్నివ్వగలిగినంత సులభంగా, సంతోషాన్నివ్వలేం — అన్నది రామన్న మేనమామ గ్రహించిన జీవిత సత్యం. అందువల్ల, అతడి మాటల్లో వాక్చాతుర్యం, అవగాహనాలోపం అంటూ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

— (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు



## కవికోకిల సరోజినీ నాయుడు

1879 ఫిబ్రవరి 13వ తేదీ హైదరాబాదులో జన్మించిన సరోజినీదేవి పదకొండేళ్ళప్రాయంలోనే ఆంగ్లంలో కవితలల్లడం ప్రారంభించింది. ఆమె తండ్రి అఘోర్‌నాథ్ చటోపాధ్యాయ భారత జాతీయ కాంగ్రెస్ స్థాపనకు కృషి చేసిన వారిలో ఒకరు. ఆయన కూడా కవి. ఉర్దూ, బెంగాలీ భాషలలో కవితలు రచించేవాడు. సరోజినీదేవి తల్లి వరద సుందరీదేవి మధుర గాయని. ఆమె బెంగాలీలో స్వయంగా గీతాలు రచించి, ఆలపించేది. సరోజినీదేవి అతి పిన్న వయసులోనే కవితలు రాయడానికి ఆమె తల్లి దండ్రులు, ముఖ్యంగా ఆమె తండ్రి స్ఫూర్తిగా నిలిచారు.

సరోజినీదేవికి పదమూడేళ్ళ ప్రాయంలో తీవ్రంగా జబ్బు చేస్తే, డాక్టర్లు పుస్తకం ముట్టుకోకూడదనీ, చదవకూడదనీ సలహా ఇచ్చారు. అయితే, సరోజినీదేవి అప్పుడే 2000 వాక్యాలతో ఒక నాటకం రచించి పూర్తి చేసిందట!

తన కుటుంబంలో వ్యతిరేకత ఏర్పడినప్పటికీ ఆమె డా॥గోవిందరాజులు నాయుడును 1898లో వివాహమాడింది.

ఆమె మొదటి కవితా సంకలనం 'ది గోల్డెన్ థ్రెషోల్డ్' విమర్శకుల ప్రశంసల నందుకున్నది. 'ది ఫెదర్ ఆఫ్ ది డాన్' 'ది బర్డ్ ఆఫ్ టైమ్', 'ది బ్రోకెన్ వింగ్' 'ది సెప్టెర్డ్ ఫ్లూట్' మొదలైనవి ఆమె ఇతర రచనలు. సమకాలీన సాహితీవేత్తలయిన ఆర్థర్ సైమన్స్, ఎడ్మండ్ గూస్ ఆమె కవితలను ప్రశంసించారు. సరోజినీదేవి మంచి కవయిత్రి మాత్రమేకాదు; గొప్ప వక్త కూడా. ఆమె ఉపన్యాసాలు చతురోక్తులతో, హాస్యోక్తులతో సాగేవి. స్త్రీల హక్కుల కోసం సరోజినీదేవి పోరాడారు. స్త్రీల జీవితాలలో మార్పురావాలంటే విద్యప్రధానం అని ఆమె ఉద్బోధించారు. స్త్రీల ఓటు హక్కు కోసం కూడా ఆమె కృషి చేశారు.

ఆమె రాజకీయ రంగంలో ప్రవేశించడానికి పూర్వం దక్షిణాఫ్రికాలో జాత్యహంకారాన్ని వ్యతిరేకించి గాంధీజీతో కలిసి పోరాడారు. గోపాల కృష్ణ గోఖలే ఆమెను రాజకీయాలలోకి ప్రవేశ పెట్టాడు. ఆమె ఆలిండియా హోమ్‌రూల్‌లీగ్ సభ్యురాలుగా 1919లో లండన్ వెళ్ళి స్త్రీల హక్కుల గురించి ఉపన్యసించారు.

1925 వ సం॥లో జరిగిన కాన్పూర్ కాంగ్రెస్ మహాసభకు ఆమె అధ్యక్షత వహించారు. 1930వ సం॥ లో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని కార్యకర్తలకు ప్రేరణ కలిగించారు. 1931వసం॥లో లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధీజీతో కలిసి వెళ్ళారు.

క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో గాంధీజీని ఆగాఖాన్ భవనంలో బంధించినప్పుడు సరోజినీదేవి కూడా అక్కడే కారాగారవాసం అనుభవించారు. హాస్య భరితమైన చతురోక్తులతో ఆమె చుట్టూవున్నవారికి ఉత్సాహం కలిగించేది. భారత కోకిల (నైటింగేల్ ఆఫ్ ఇండియా) అని గాంధీజీ ఆమెను వర్ణించాడు.

మన దేశ స్వాతంత్ర్యానంతరం ఆమె ఉత్తర ప్రదేశ్ గవర్నర్‌గా తన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు.

1949 మార్చి 21వ తేదీ ఆమె కీర్తిశేషులయ్యారు.




# యక్షపర్వతం

## 2

[బందిపోట్ల నాయకుడు, స్వర్ణాచారి అనేవాణ్ణొకణ్ణి పట్టుకుని, అతడి ద్వారా అరణ్యంలోని ఒక కుటీరంలో నివసిస్తున్న ఇద్దరు క్షత్రియ యువకుల్ని గురించి తెలుసుకున్నాడు. ఆ సమయంలో స్వర్ణాచారి కేకలు విని విఘ్నేశ్వరపూజారి అనేవాడు, బందిపోట్ల పైకి క్షత్రియ యువకుల పెంపుడు సింహాన్ని ఉసికొల్పాడు. అది బందిపోట్లలో ఒకడి మీద పడి, గట్టిగా గొంతుపట్టుకున్నది. తరవాత-]

హఠాత్తుగా గర్జిస్తూ, వెనకవస్తున్న తన అనుచరుడిమీద పడిన సింహాన్నిచూస్తూనే, బందిపోట్లనాయకుడు అదిరిపడ్డాడు. అతడు ఒక క్షణం ఏమి చేయటమా అని ఆలోచించి, చప్పున ఈటెను పైకెత్తి,సింహంకేసి బలంగా విసిరాడు. ఈటె పోయి సింహానికి ఒక అడుగు దూరంలో నేలను తాకి, నిలువుగా గుచ్చుకుపోయింది.సింహం మాత్రం బంది పోటును గొంతుపట్టుకుని అటూ ఇటూ విదిలిస్తూ నేలమీద పొర్లించటం మాన లేదు.బందిపోట్లనాయకుడు చుట్టూ ఒక సారి చూశాడు. సింహంపట్టులో చిక్కిన బందిపోటువాడి ఒంటె బెదిరి, క్షత్రియ యువకుల కుటీరం వెనకవున్న చెట్లకేసి పారిపోయింది. మరొక అనుచరుడి ఒంటె మీదనుంచి స్వర్ణాచారి, 'రక్షించండి, రక్షిం చండి,' అంటూ బిగ్గరగా కేకలు పెడు తున్నాడు.

బందిపోట్లనాయకుడు, స్వర్ణాచారికేసి రౌద్రంగా చూస్తూ, ''ఒరే, వాస్తుపక్షీ! ఇక నైనా నోరుమూసుకుని మావెంట వస్తావా, లేకపోతే ఒంటెమీదనుంచి కిందికిపడదోసి, సింహానికి మేతగా వెయ్యమంటావా?'' అన్నాడు.

ఈ ప్రశ్న స్వర్ణాచారికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. క్షత్రియ యువకుల పెంపుడు



సింహం తనకు బాగా మాలిమి అయినదే! ఆ కారణంగా, అతడు లేనిభయాన్ని నటిస్తూ, ''ఉష్ట్రనాయకా! నన్ను సింహానికి మేతగా వెయ్యండి. ఆ విధంగానైనా జన్మభూమి లోనే మరణిస్తాను.ఈ విశాల భూప్రపంచంలో జన్మభూమికన్న ప్రియమైనది మరేం వున్నది!'' అన్నాడు.

బందిపోటునాయకుడికి ఒకక్షణకాలం స్వర్ణాచారిని ఒంటెమీదినుంచి కిందపడ వేయటమే మంచిదనిపించింది. కాని, అతడికి మరుక్షణంలో తాను కొండచరియ ప్రాంతాల కట్టనున్న రాజధానీ నగరం మాట గుర్తుకొచ్చింది. అందువల్ల, అతడు తన అనుచరుడితో, ''ఒరే, ఆ వాస్తుపక్షిని ఇక్కడ సింహానికి ఆహారంగా వేయకు. మనం నిర్మించబోయే కొండకోట నగరానికి వాడి సాయం కావలసివస్తుంది. అక్కడ వాడు అంతగా మన మాట వినకపోతే, అప్పుడు ముక్కలు ముక్కలుగా నరికి, ఏ తోడేళ్ల పాటలో నింపుదాం!'' అన్నాడు.

ఈ మాటలతో స్వర్ణాచారికి నిజంగానే చావుభయం కలిగింది. అతడు సింహానికేసి తలతిప్పి, ''భీమా!భీమా!'' అంటూపెద్దగా కేకపెట్టి, ''రక్షించండి!'' అంటూ అరవసాగాడు.

సింహం తనపేరు చెవులపడగానే గర్జిస్తూ లేచి, స్వర్ణాచారివున్న ఒంటెకేసి దూకింది. అయితే, రానున్న ప్రమాదాన్ని గుర్తించిన బందిపోటు, ఒంటెను గట్టిగా అదిలించాడు. ఒంటె జొన్నపొలాల కేసి పరుగు తీసింది. దాని వెనకగా బందిపోటునాయకుడు, తన ఒంటెను వేగంగా పరిగెత్తించాడు.

ఈ జరిగినదంతా విఘ్నేశ్వరపూజారి, కుటీరం వెనకవుండి చూస్తూనేవున్నాడు. స్వర్ణాచారి, బందిపోట్లకు బందీఅయి పోవటం, అతడికి ఎంతో బాధ కలిగించింది. ఆ సమయంలో అరణ్యంలో వేట ముగించి, క్షత్రియ యువకులిద్దరూ తమ కుటీరం కేసి బయలుదేరి వస్తున్నారు.

కొంతసేపటికి వాళ్ళు కుటీరాన్ని సమీపిస్తున్నంతలో, విఘ్నేశ్వరపూజారి చెట్ల వెనకనుంచి వాళ్ళముందుకు పరిగెత్తుకుంటూ వస్తూ, ''మహాయోధుల్లారా, ఖడ్గజీవదత్తు ల్లారా! పుట్టి మునిగింది, కొంపలంటుకున్నై, సర్వనాశనం జరిగిపోయింది!'' అన్నాడు.

ఆ మాటలకు, క్షత్రియ యువకుల్లో ఒకడు పూజారికేసి నిశితంగా చూస్తూ, ''ఏమిటా సర్వనాశనం?ఈ భీముడు బోనులో నుంచి ఎలా బయట పడగలిగాడు?'' అంటూ, తన దగ్గరకు వచ్చిన సింహాన్ని చూపించాడు.

విఘ్నేశ్వరపూజారి, వాళ్ళకు అక్కడ జరిగిన బీభత్సం సంగతి గబగబాచెప్పి, ''ఖడ్గజీవదత్తుల్లారా! త్వరగా కుటీరం దగ్గరకు రండి. అక్కడ భీముడి పంజా దెబ్బలకు చచ్చిన బందిపోటును కూడా చూడవచ్చు,'' అన్నాడు.

విఘ్నేశ్వరపూజారి ముందుండి దారి తీయగా, ఖడ్గజీవదత్తులు అతడి వెనక నడిచారు. పూజారి వాళ్ళను చచ్చిపడివున్న బందిపోటు దగ్గరకు తీసుకుపోయి, ''ఈ శత్రుశవాన్ని తిలకించండి! మన భీముడి పంజాదెబ్బకు వీడు ఘోరనరకాన్నో, వీర స్వర్గాన్నో అలంకరించాడు,'' అన్నాడు.

జీవదత్తుడు, శవంకేసి పరీక్షగా చూసి, ''వీడు అడవిజాతివాడు కాడు. దుస్తుల తీరూ, ముఖలక్షణాలూ చూస్తూంటే, ఎక్కడో దూరప్రాంతంనుంచి, ఈ అరణ్యం లోకి వచ్చినట్టుంది,'' అన్నాడు.

''వీడు కాస్త ప్రాణంతో వున్నట్టయితే, ప్రశ్నించి అన్ని రహస్యాలూ బయటికిలాగే పని,'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఖడ్గా! ఈ బందిపోట్లను వదలరాదు; వేటాడితీరవలసిందే! వాళ్ళు ఎటుపోయారో, ఖడ్గమృగజాతివాళ్ళలో కొందరైనా తప్పక చూసేవుంటారు,''అని జీవదత్తుడు, పూజారితో, ''నువ్వు వెళ్ళి, ఈ చుట్టుపక్కల తిరిగి చూసి ఎవడైనా ఖడ్గజాతివాడు కనిపిస్తే, వాణ్ణి వెంటనే ఇక్కడికి తీసుకురా!'' అన్నాడు.

విఘ్నేశ్వరపూజారి అక్కడినుంచి బయలు దేరి కొద్దిదూరం వెళ్ళేంతలో, ఖడ్గజాతివాళ్ళ నాయకుడు అరణ్యమల్లూ, అతడి అను చరులు కొందరూ రావటం అతడి కంట



బడింది. పూజారి వాళ్ళకేసి గబగబా పోయి, ''క్షత్రియ యువకులు వేటనుంచి ఇప్పుడే తిరిగివచ్చారు. ఒంటెలమీద వచ్చిన బందిపోట్లను, మీలో ఎవరైనా చూశారా? వాళ్ళు, నా ప్రాణమిత్రుడైన స్వర్ణాచారిని అపహరించుకుపోయారు,'' అన్నాడు.

''పూజారీ! ఆ దుర్మార్గులు, మా పొలా ల్లోని పంటను కూడా దోచుకుపోయారు. ఖడ్గజీవదత్తప్రభువులెక్కడ?'' అంటూ అరణ్యమల్లు వాళ్ళు కుటీరం ముందు వుండటంచూసి అక్కడికి వచ్చి, ''ఖడ్గజీవ దత్తప్రభువుల్లారా! మా పంటలను బంది పోట్లు దోచుకుపోయారు.ఓటమి ఎరుగని మా ఖడ్గమృగజాతివీరులు, వాళ్ళ ధాటికి నిలబడలేక, అరణ్యపురానికి పారిపోయి వచ్చారు,'' అని చెప్పాడు.

''రాజువైన నువ్వూ, ఆ బందిపోట్లకు వెన్నిచ్చిపారిపోయావా? నీ పిరికితనం చూసి,



నీ అనుచరులేమనుకుంటారు!'' అన్నాడు ఖడ్గవర్మ కోపంగా.

''అయ్యా, ఆ పారిపోయింది నేను! రాజుగారు ఆ సమయంలో ఇక్కడ లేరు,'' అంటూ మంత్రిశిలాముఖి,ఖడ్గజీవదత్తుల ముందుకు వచ్చాడు.

''అలాగా! వాళ్ళు మనం ఎరగని కొత్త ఆయుధాలేమైనా మీమీద ప్రయోగించారా? లేక, ఆ ఒంటెల్నిచూసి, మీ ఖడ్గమృగాలు బెదిరి పారిపోయాయా?'' అని అడిగాడు జీవదత్తుడు.

శిలాముఖి కొండవాగు దగ్గర జరిగిన దంతా చెప్పి, ''ఆ బందిపోట్లదగ్గర కత్తులూ, ఈటెలూ తప్ప మరేంలేవు. కాని, ఒంటె అని మీరు చెప్పే ఆ వింతజంతువును చూసి, మావాళ్ళు ఎందుకనో చాలా భయపడి పోయారు,'' అన్నాడు.

''సరే , జరిగిందేదో జరిగిపోయింది. మేం స్వర్ణాచారిని బందిపోట్లనుంచి విడి పించుకురావాలి. కనుక మీలో కొందరు బయలుదేరి, వాళ్ళుపోయినదారి గుర్తులు తెలుసుకునిరండి!'' అన్నాడు జీవదత్తుడు.

అరణ్యమల్లు, తన అనుచరులలో నలుగురిని, బందిపోట్లు పోయిన మార్గం తెలుసుకురమ్మని ఆజ్ఞాపించాడు.ఆ వెంటనే ఆ నలుగురూ ఖడ్గమృగాలను ఎక్కి కొండ వాగు కేసి బయలుదేరారు.

ఆ సరికి సూర్యాస్తమయమై చీకటి పడుతున్నది. ఖడ్గజీవదత్తులు వంట చేసి భోజనాలు ముగించి కుటీరం బయటికి వచ్చారు. ఆ సమయంలో, బందిపోట్ల జాడలు తెలుసుకోవడానికి పోయిన ఖడ్గ జాతివాళ్ళల్లో ఒకడు తిరిగివచ్చాడు.వాడెక్కి వున్న ఖడ్గమృగం ఆయాసంతో రొప్పుతున్నది.

తన అనుచరుణ్ణి చూస్తూనే రాజు అర ణ్యమల్లు ఆదుర్దాగా, ''బందిపోట్లు కని పించారా? నీతో బయలుదేరిన తతిమ్మా ముగ్గురూ ఏమయ్యారు?'' అని అడిగాడు.

ఖడ్గజాతివాడు-నాలుగుమాటల్లో సంగతి సందర్భాలన్నీ చెప్పేశాడు. బందిపోట్లు కొండ

వాగునుదాటి ఉత్తరదిశగా వెళ్ళిపోతున్నారు. ఆసంగతి చెప్పేందుకు ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు ముందుగా పరుగులమీద వచ్చాడు.

''మిగిలిన వాళ్ళు బందిపోట్ల వెన్నంటి పోతున్నారా?'' అని అడిగాడు జీవదత్తుడు.

''పోతున్నారు, దొరా! మనం వెళ్ళి వాళ్ళను కలుసుకునేవరకూ, వాళ్ళు బంది పోట్లను కనుమరుగు కాకుండా చూస్తూనే వుంటారు,'' అన్నాడు ఖడ్గజాతివాడు.

జీవదత్తుడు ఒక క్షణకాలం మౌనంగా వూరుకుని, ఖడ్గవర్మతో, ''ఖడ్గా, ఇక మనం బయలుదేరవచ్చు. బాగా చీకటిపడినతర్వాతే మనం ఆ బందిపోట్లువున్న ప్రదేశాన్ని చేరటం క్షేమం. ఏమైనా, స్వర్ణాచారిని, ఈ రాత్రికే విడిపించుకు రావాలి,'' అన్నాడు.

ఆ తర్వాత, ఖడ్గజీవదత్తులు తమ తమ కత్తులూ, విల్లంబులూ తీసుకుని ప్రయాణానికి సిద్ధమవుతూండగా, విఘ్నేశ్వర పూజారి హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా ఎగిరిపడి, ''క్షత్రియయోధుల్లారా! మన సింహం చంపిన బందిపోటువాడి ఒంటె, ఈ ప్రాంతంలోనే ఎక్కడోవుంటుంది. దాన్ని వాహనంగా ఉపయోగించుకోవచ్చు, వెతికించండి!'' అన్నాడు.

ఆ మాటవింటూనే నలుగురు ఖడ్గజాతి వాళ్ళు, కుటీరం వెనకవున్న అరణ్యంలోకి పోయి, పావుగంటకాలం గడిచీగడవకముందే ఒంటెను వెతికిపట్టుకుని ఖడ్గజీవదత్తుల దగ్గరకు వచ్చారు. బందిపోట్లను గురించిన సమాచారం తెచ్చినఖడ్గజాతివాడు ముందుండి దారితీయగా, ఖడ్గజీవదత్తులు ఒంటెమీద ప్రయాణమయ్యారు.



వాళ్ళు అరణ్యంలో కొంతదూరం వెళ్ళిన తర్వాత, నదీ తీరాన గల ఒక కొండ పక్కన, బందిపోట్లు వంటపనులు ప్రారంభించటం కనిపించింది. వాళ్ళల్లో కొందరు ఎండుపుల్లల కోసం వెతుకుతూ, చెట్లలో తిరుగుతున్నారు.

''జీవా! మనం ముందు స్వర్ణాచారిని, ఈ దుర్మార్గులు ఏమి చేసిందీ తెలుసు కోవడం అవసరంగదా! ఎండుపుల్లల కోసం తిరుగుతున్న ఒక బందిపోటును ప్రాణాలతో పట్టుకుంటే, సంగతి సందర్భాలన్నీ తెలుసుకోవచ్చు,'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఆహా, ఈ ఎత్తుగడ బాగానేవున్నది. వెంట ఒక ఖడ్గజాతివాణ్ణికూడా తీసుకుపో. మనం ఇక్కడ దాగివున్న సంగతి మాత్రం, ఆ బందిపోట్లకు తెలియకుండా పని పూర్తి చేసుకురావాలి!'' అని హెచ్చరించాడు జీవ దత్తుడు.



ఖడ్గవర్మ, ఒక ఖడ్గజాతివాణ్ణి వెంట బెట్టుకుని, చెట్లల్లో ఎండుపుల్లలకోసం వెతుకుతున్న బందిపోట్లలో ఒకణ్ణి పట్టుకునేందుకు బయలుదేరాడు. అతడికి త్వరలోనే అలాంటి వాడొకడు కనిపించాడు. కాని, తనను చూసి అనుచరులను హెచ్చరించక ముందే వాణ్ణి గొంతు నొక్కిపట్టుకోవాలి!

ఖడ్గవర్మ ఒక ఉపాయం ఆలోచించాడు. బందిపోటువాడు చెట్లకింద పడివున్న ఎండుపుల్లలను పోగుచేయటమేగాక, ఎండినవని అనుమానం కలిగిన చెట్లకొమ్మలనుకూడా బలంగా లాగి విరుస్తున్నాడు.

ఖడ్గవర్మ, తనవెంటవున్న ఖడ్గజాతివాణ్ణి హెచ్చరించి, వాడిచేత ఒక పెద్ద ఎండుకొమ్మను చెట్టునుంచి విరిపించి, అది దభీమని కిందపడుతూండగానే పరిగెత్తి, వాడితోపాటు దగ్గిరవున్న ఒకచెట్టు వెనక దాక్కున్నాడు. ఎండుకొమ్మ విరిగిపడిన శబ్దం వింటూనే, బందిపోటు దాన్ని ఎత్తుకుపోయేందుకు అక్కడికి వచ్చాడు. వాడున్న అవసరంలోవాడికి అంతపెద్ద ఎండుకొమ్మ దానికై అది చెట్టునుంచి విరిగి ఎందుకు పడుతుందా అన్న అనుమానం కలగలేదు.

బందిపోటువాడు వంగి ఎండుకొమ్మను కదిలించబోయే సమయంలో, ఖడ్గవర్మ వెనకనుంచి మీదపడి, వాడి గొంతును రెండు చేతులతో బలంగా వడిసిపట్టుకున్నాడు. అదే సమయంలో ఖడ్గజాతివాడు అక్కడికి వచ్చి, ఈటెను వాడి గుండెలకు గురిచేసి, నోరెత్తితే ఈటెతో పొడుస్తానని సౌంజ్ఞచేశాడు.

ప్రాణభయంతో గడగడవణికిపోతున్న బందిపోటును, మెడపట్టుకునిలేపి నిలబెట్టి, ఖడ్గవర్మ వాడితో, "నోరెత్తకుండా నా వెంటరా, నీకెలాంటి ప్రాణహానీ కలగదు. కాని, అరిచి నీ అనుచరులను హెచ్చరించ ప్రయత్నించావో - నిన్నిక్కడే నిలువునా నరికేస్తాను," అన్నాడు.

బందిపోటువాడు కుక్కినపేనులా అయిపోయి, ఖడ్గవర్మ వెంట బయలుదేరాడు. ఖడ్గవర్మ తెచ్చిన బందిపోటును చూసి జీవదత్తుడు చాలా సంతోషించి, "ఒరే, కొండవాగు దగ్గర మీరు పంట పొలాలు దోచుకున్నారుగదా, ఆ సమయంలో మీరు పట్టుకున్న స్వర్ణాచారి అనే అతణ్ణి ఏం చేశారు?" అని ప్రశ్నించాడు.

"నిజంచెపితే నన్నుప్రాణాలతో వదిలేస్తారా?" అన్నాడు బందిపోటు వణుకుతూ.

"తప్పకుండా వదులుతాం!" అన్నాడు జీవదత్తుడు.

"అయ్యా, ఆ ఆచారి దారిపొడుగునా 'రక్షించండి!' అంటూ కేకలు పెట్టసాగాడు. అందుకని, మా నాయకుడు, వాణ్ణి జొన్న కంకులున్న గోతాంలో గొంతువరకూ దూర్చి, గోతాం మూతి బిగించాడు. ఇప్పుడు వాడు నది ఒడ్డున మేం ఒంటెల మీద నుంచి దించిన సామానుల్లో పడివున్నాడు. ఇక నాకు ప్రాణహాని కలిగించరుగదా? అంతా నిజం చెప్పాను," అన్నాడు బందిపోటు.

"నువ్వు చెప్పినదాంట్లోవున్న నిజానిజాలు తెలుసుకునేవరకూ, నిన్నిక్కడే ఒక చెట్టుకు కట్టివేసి వుంచుతాం. నోరెత్తి అరవకుండా వుండేందుకు, ఇన్ని చెట్లఆకులు నీనోట కుక్కక తప్పదు!" అని జీవదత్తుడు, పక్కన వున్న ఒక ఖడ్గజాతివాడికి సౌంజ్ఞ చేశాడు.

బందిపోటును వాడు దూరంగా తీసుకు పోగానే,ఖడ్గజీవదత్తులు ఒక చెట్టుమీదికి పోయి, బందిపోట్లు విడిదిచేసిన ప్రాంతాన్ని పరీక్షగా చూడసాగారు. హఠాత్తుగా ఖడ్గ వర్మకు,బందిపోట్లు విడిదిచేసిన చోటుకు దాపులనున్న కొండగుహలో కాగడా వెలుగు కనిపించింది.

అతడు ఆశ్చర్యపోతూ, "జీవా, అదేమిటి? ఆ కొండగుహలో కాగడా వెలుగు చూశావా? శరీరమంతా జడలమయంగావున్న ఆ వికృతాకారుడెవరూ? వాణ్ణి మంత్రదండంతో కొడుతున్నవాడు అంతకన్నకూడా వికృతంగా వున్నాడే!" అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ చెప్పిన గుహకేసి దృష్టిసారించాడు. ఖడ్గవర్మ చెప్పిన విధంగా గుహలో ఒక కాగడా వెలుగుతున్నది. దాని వెలుగులో-శరీరమంతా పొడవాటి జడలు వేలాడుతున్న వికృతాకారుడొకడూ, నల్లని వస్త్రం ధరించి చేతగల మంత్రదండాన్ని బందిపోట్లకేసి వూపుతున్న మాంత్రికుడొకడూ కనిపించారు.

ఖడ్గజీవదత్తులు అమితాశ్చర్యంతో, ఆ వింత మానవులకేసి చూస్తూండగానే, శరీరమంతా జడలుగల వికృతాకారుడు— కొండలూ, అరణ్యం మార్మోగేలా పెద్దగా ఒక కేకపెట్టి, గుహలోనుంచి బయటికిదూకి బందిపోట్లకేసి పరిగెత్తుకురాసాగాడు. అతడి నుదుటిమీద నిప్పుకణంలా ఏదో వెలుగుతూ ఆరిపోతున్నది. —(ఇంకావుంది)



ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

# 13. పరమార్థ సాధనకు మార్గం!



"ధ్రువుడి కథ అద్భుతంగా వుంది, తాతయ్యా! అయినా, నాకొక అనుమానం. ప్రార్థిస్తే మన ముందు దేవుడు నిజంగానే ప్రత్యక్షమవుతాడా?" అని అడిగాడు సందీపుడు.

"నీ ప్రశ్నను, దేవుణ్ణి తెలుసుకున్నవారికే సమాధానం చెప్పడం సాధ్యం. కేవలం దేవుణ్ణి గురించిన జ్ఞానం మాత్రం అందుకు చాలదు," అన్నాడు దేవనాధుడు.

"అదేంటి తాతయ్యా, దేవుణ్ణి గురించిన జ్ఞానం కన్నా, దేవుణ్ణి తెలుసుకోవడం భిన్నమైనదా?" అని అడిగాడు సందీపుడు.

"అవును, భిన్నమైనదే, రెండింటి మధ్య మహాసముద్రం రెండు తీరాల మధ్య ఉన్నంత భేదం ఉంది. దేవుణ్ణి గురించి కొద్దో గొప్పో తెలిసినవారు చాలామందే వుంటారు. అయితే దివ్య అనుభూతి చెంది గ్రహించిన వారు మాత్రం బహు కొద్ది మందే. నేనుఒక గ్రామంలో పుట్టాను. చదువులకని పట్నం చేరేంతవరకు చాక్లెట్ల గురించి-మంచి రంగుతో, అందమైన కాగితంలో చుట్టబడి చాలా తియ్యగా వుంటుందని వినడమే తప్ప, వాటినెప్పుడూ చూడనేలేదు. పట్నం వచ్చాకే రుచి చూడడం జరిగింది. వినడం, తినడం ఈ రెండింటి మధ్య ఎంత తేడా వుందో మీకే తెలుసు. దేవుడి విషయంలోనూ అంతే. జ్ఞానం వేరు; అనుభవం, అనుభూతి వేరు," అని కొంతసేపు ఆగాడు దేవనాధుడు.

ఆ తరవాత ఆయనే, "ఏదో సరదాకు చూడాలనుకుంటే దేవుడు మన ముందు ప్రత్యక్షం కాడు. నీళ్ళ కోసం చేపలా, గాలి కోసం ప్రాణిలా మనిషి దేవుడి కోసం తపించాలని పెద్దలు చెబుతారు. దానికి పెద్ద ప్రయత్నం చేయాలి. అదీ ఒక్క రోజులో సాధ్యమయ్యే పని కాదు. సంవత్సరాలు కూడా చాలవు. ఎందుకూ! ఒక్క జన్మలో సాధ్యం కాకుండా పోవచ్చు. భగవత్ సాక్షాత్కారానికి కొన్ని జన్మలు పట్టవచ్చు. ధ్రువుడి కథే తీసుకుందాం. అంతకు పూర్వ జన్మలో అతడు ఒక భక్తుడి కొడుకు. పసిప్రాయం నుంచే భగవద్భక్తి ఎక్కువ. అతడు తన ఈడు

## ...తి - చరిత్ర



వాడూ, మిత్రుడూ అయిన ఒక రాజకుమారుణ్ణి చూసి, అలాంటి భోగభాగ్యాలు గల రాజ కుమారుడి జీవితం బావుంటుంది కదా అని ఒక క్షణకాలం ఆలోచించాడట. ఆయన కోరిక నెరవేరింది. ప్రాపంచిక సుఖాలు క్షణికాలనీ, ఎండమావులనీ గ్రహించడానికే ఆయన రాజ కుమారుడుగా జన్మించాడు!

''ధ్రువుడికి తన పూర్వజన్మస్మృతి ఉండేదా తాతయ్యా?'' అని అడిగింది శ్యామల.

''లేదు. కాని క్రమంగా దానిని గురించి గ్రహించాడు. ఆయన పూర్వజన్మ కథ ఇలా సాగుతుంది: యువకుడైన అతడు ఒక రోజు ఒక ముని వెంట నడుస్తున్నాడు. ఎందరెందరో తలనెరిసిన వృద్ధులు సాధించలేని దానిని తాను సాధించాననీ, వాళ్ళ అనుమానాలను కూడా తీర్చగలుగుతున్నాననీ వాడు మనసులో మురిసి పోతూ నడవసాగాడు. ముందు నడుస్తూన్న ముని ఆగి, ఎత్తుగా ఉన్న ఒక మట్టి దిబ్బను చూపుతూ, '' ఆ చెట్టు కింద వున్న మట్టి దిబ్బ ఏమిటో తెలుసా?'' అని అడిగాడు. అతడు తెలియదు అన్నాడు. అప్పుడు ముని, ''అక్కడే నువ్వు కూర్చుని దేవుణ్ణి గురించి తపస్సు చేస్తూ ప్రాణాలు వదిలావు. ఒక్కసారికాదు; పలుసార్లు. అనేక జన్మలు అలాగే సాగాయి. నువ్వు వదిలిన అస్థిపంజరాలతోనే ఆ దిబ్బ ఏర్పడింది!'' అన్నాడు.

ఆ మాటలకు యువకుడు దిగ్భ్రాంతి చెందాడు. అతని అహంకారం పటాపంచల యింది. భగవదనుభూతి పొందడమే మానవ జన్మ పరమార్థం. అయితే దానిని సాధించడం ఒక్క జన్మలో సాధ్యంకాదు. అది సుదీర్ఘ



ప్రయత్నం అనే పరమ సత్యాన్ని ఈ కథ చెబు తుంది,'' అన్నాడు దేవనాథుడు.

''దేవుణ్ణి తెలుసుకున్నాక కూడా అహం కారం కొనసాగడం ఆశ్చర్యంగా లేదూ?'' అన్నది దేవనాథుడి వెనకనుంచి అంతా విన్న దేవనాథుడి కోడలు.

''అవును, తల్లీ! మనిషి విచిత్రమైనవాడు. క్లిష్టమైన ప్రాణి. పరస్పర విరుద్ధ స్వభావాలుగల మనుషుల్ని మనం జీవితంలో ఎందర్ని చూడడం లేదు? మూర్ఖుడనుకున్నవాడు హఠాత్తుగా వివేకంతో వ్యవహరిస్తాడు. వివేకి అనుకున్నవాడు పరమ మూర్ఖంగా నడుచుకుంటాడు. ఆధ్యా త్మికంగా కొంత ప్రగతి సాధించిన వ్యక్తి, కొన్ని సందర్భాలలో మామూలు మనిషికన్నా హీనంగా నడుచుకోవచ్చు. దేవుణ్ణి తెలుసుకున్నవాడు అహంకార రహితంగా, దుష్టభావాలకు దూరంగా మసలుకోవాలి. అయితే, కొందరు ఆత్మస్థాయిలో దేవుణ్ణి తెలుసుకుని కూడా మానసిక స్థాయిలో



మాత్రం మామూలుగానే ఉండిపోతారు,'' అన్నాడు దేవనాథుడు.

''ఉదాహరణకు ఎవరైనా ఉన్నారా తాతయ్యా?'' అని అడిగింది శ్యామల.

''ఉన్నారు తల్లీ! మన పురాణాలలో వసిష్ఠుడు, విశ్వామిత్రుడు అనే మునులను గురించి విన్నారు కదా? వసిష్ఠుడు సత్య సంపన్నుడు; శాంతస్వభావి. దేవుణ్ణి తెలుసుకున్న బ్రహ్మ ఋషి. వసిష్ఠుడి తపోబలాన్నీ, శక్తి సామర్థ్యాలనూ చూసి అబ్బురపడి రాజ్యాన్ని త్యజించి తపస్వి అయినవాడు విశ్వామిత్రుడు. ఆయన కఠోర తపస్సు చేశాడు. వసిష్ఠుడి నోటిగుండా బ్రహ్మర్షి అనిపించుకోవాలని ఉబలాటపడి నానా విధాలుగా ప్రయత్నించాడు. కాని ఫలించ లేదు. వసిష్ఠుడంటే విశ్వామిత్రుడికి ఆరంభం నుంచే అసూయ. ఆధ్యాత్మిక మార్గంలో అసూయా ద్వేషాలకు చోటు ఉండదు. తనను బ్రహ్మర్షి అని అంగీకరించమని వసిష్ఠుణ్ణి కోరాడు. కాని వసిష్ఠుడు అందుకు అంగీకరించలేదు. విశ్వామిత్రుడికి ఆగ్రహం వచ్చింది. అసూయ, ఆగ్రహం మనిషిని పట్టుకుంటే ఆ మనిషి తన చర్యల మీదే అదుపును కోల్పోతాడు. విశ్వామిత్రుడికి కూడా అదే జరిగింది. వసిష్ఠుణ్ణి నిర్బంధించాడు; అవమానించాడు. తానే అవమానం పాలయ్యాడు. ఆఖరికి వసిష్ఠుడి కొడుకులను చంపించాడు. వసిష్ఠుడు అన్నీటినీ ఓర్పుతో భరించాడు.

చుట్టూ గాఢాంధకారం అలముకున్న అర్ధరాత్రి సమయంలో తన కుటీరంలో ఒంటరిగా కూర్చుని విశ్వామిత్రుడు కోపంతో రగిలిపోయాడు. మునులందరూ గౌరవించే వసిష్ఠుడు తనను గౌరవించడంలేదు. అందువల్లే తక్కినవారూ తనను గౌరవించడంలేదు. తాను బ్రహ్మర్షి కావడానికి వసిష్ఠుడే అవరోధంగా ఉన్నాడు అని ఆలోచించసాగాడు. దేవుడితో తనకున్న సంబంధం మీద తప్ప ఎదుటివారి అభిప్రాయాలమీద తన ఆధ్యాత్మిక స్థాయి ఆధారపడలేదు- అన్న సాధారణ విషయాన్ని కూడా కోపావేశం కారణంగా విశ్వామిత్రుడు మరచిపోయాడు. అవరోధాన్ని తొలగించాలనుకున్నాడు. ఆయన లేచి, రాజుగా ఉన్నప్పుడు ఉపయోగించిన ఖడ్గాన్ని అందుకుని వేగంగా వసిష్ఠుడి కుటీరం కేసి నడిచాడు.

కుటీరం సమీపించి, తలుపుకు చెవులు ఆనించి విన్నాడు. వసిష్ఠుడి భార్య అరుంధతి భర్తను విశ్వామిత్రుణ్ణి బ్రహ్మర్షిగాఅంగీకరించమని ప్రార్థిస్తున్నది. దాని ద్వారా ఆయన తమను వేధించడం తప్పుతుందని ప్రాధేయపడుతున్నది. ''బ్రహ్మర్షి కావాలని రాజ్య సింహాసనాన్నే త్యాగం చేసి వచ్చిన ఆయన్ను ఇంకా నిరాకరించడంవల్ల మీరు సాధించే ప్రయోజనం ఏమిటి?'' అని అడిగింది అరుంధతి.

"రాజ్య సింహాసనం కన్నా మరింత గొప్ప దాన్ని ఆయన త్యాగం చేయాలని నేను ఆశిస్తు న్నాను. ఆయనలో గాఢంగా పాతుకుపోయిన 'అహంకారాన్ని' త్యాగం చేసే రోజు కోసం నేను ఎదురు చూస్తున్నాను," అన్నాడు వసిష్ఠుడు.

"బావుంది, కాని, మీ నుంచి ఒక్కమాట ఆయన్ను సంతృప్తి పరుస్తుంది. మిమ్మల్ని ద్వేషించడం మానేస్తాడు. ఆధ్యాత్మిక లక్ష్య సాధనకు మరింత ఏకాగ్ర చిత్తంతో సాధన చేస్తాడు కదా?" అన్నది అరుంధతి.

"కాదు, ఆ మాటతో ఆయన ఉప్పొంగి పోతాడు. తృప్తి చెంది, ఆధ్యాత్మిక సాధనపట్ల అలసత్వం ఆరంభమై ప్రగతి ఆగిపోతుంది. నా మాటతో ఆయనలో బ్రహ్మర్షి అనే భావాన్ని ఏర్పరచి, ఆయన ఆధ్యాత్మిక ప్రగతికి అడ్డు పడడం నాకు ఇష్టంలేదు. ఎంతో సాధించగల శక్తి ఆయనకు ఉన్నది. ఆయన నిజంగానే గొప్ప బ్రహ్మర్షి స్థాయిని అందుకోవాలని ఆశిస్తు న్నాను," అన్నాడు వసిష్ఠుడు.

వెలుపలినుంచి ఆ మాటలు విన్న విశ్వా మిత్రుడి చేతినుంచి ఖడ్గం జారి కింద పడింది. హాని తలపెట్టి శత్రువులా ప్రవర్తిస్తూన్న తనపట్ల సైతం ప్రేమ చూపుతూ, తన శ్రేయస్సును కోరుకుంటూన్న వసిష్ఠుడి మీద ఆయన కెంతో గౌరవం ఏర్పడింది. కన్నీళ్ళు కారుస్తూ, ఆయన వెళ్ళి వసిష్ఠుడి పాదాలపై పడ్డాడు.

ఆ తరవాత ఆయనలో ఎంతో మార్పు వచ్చింది. ఉన్నత ఆధ్యాత్మిక శిఖరాలను అందు కున్నాడు.

"మనిషి మనసు చాలా క్లిష్టమైనది. వసి ష్ఠుణ్ణి హతమార్చాలని ప్రయత్నించిన నాటికి విశ్వామిత్రుడు ఏమాత్రం ఆధ్యాత్మిక ప్రగతిని సాధించలేదని చెప్పలేము. అయితే, ఆధ్యా త్మిక కిరణాలు ప్రసరించని చోటు ఆయన హృద యంలో ఎక్కడో కొంత దాగి ఉన్నది. అదే దుర్మా ర్గంగా ప్రవర్తించేలా చేసింది. మామూలు మానవ ప్రవృత్తిని ఆధ్యాత్మిక శక్తి జయించినప్పుడే ఆయన గొప్ప ఋషి అయ్యాడు," అన్నాడు దేవనాధుడు.

"మనిషిని ఎన్నటికీ అర్థం చేసుకోలేమేమో!" అన్నాడు సందీపుడు.

"మొదట మనల్ని మనం చక్కగా అర్థం చేసుకుందాం. అప్పుడే ఎదుటి మనిషిని అర్థం చేసుకోగలం!" అంటూ లేచి నిలబడ్డాడు దేవనాధుడు. —(ఇంకావుంది)



# తెలివైన కోడలు!

చదువు పూర్తికాగానే శివరాం, జమీందారు కచ్చేరీలో మంచి ఉద్యోగం సంపాయించాడు. ఆ తర్వాత ఆరు నెలలకు అందంతోపాటు తెలివితేటలూ, మంచితనం వున్న నీరజను పెళ్ళిచేసుకున్నాడు. తల్లి అనసూయమ్మకు, కట్నకానుకలు తేలేదని కోడలిపై కోపంగా వుండేది. కాని, ఇంటికి వచ్చిన బంధువులతోనూ, ఇరుగుపొరుగు వాళ్ళతోనూ మాత్రం, తను కానీ కట్నం లేకుండా కొడుక్కు, ఎంతో ఆదర్శప్రాయంగా పెళ్ళి చేశానని గొప్పలు చెప్పుకునేది.

ఒక సంక్రాంతి పండగకు నీరజ చెల్లెలు గిరిజ అక్కను చూడడానికి వచ్చింది. పండగకు తన చెల్లెలికి మంచి చీర కొనిపెట్టాలని నీరజ ఆలోచించి, ఆ సంగతి భర్త శివరాంకు చెప్పింది. శివరాం, "అమ్మ సంగతి నీకు తెలుసుకదా! ఇల్లు గుల్లచేస్తున్నావంటూ తర్వాత నిన్ను సూటీపోటీ మాటలు అని తీరుతుంది!" అన్నాడు.

ఆ సాయంత్రం శివరాం కచ్చేరీనుంచి తిరిగి రాగానే, నీరజ అతడికి చీర విషయంలో ఒక ఉపాయం చెప్పింది. శివరాం సరేనని, మర్నాటి సాయంత్రం ఇంటికి వచ్చేటప్పుడు ఒక మంచి చీర కొని తెచ్చాడు.

ఆ సమయంలో అనసూయమ్మ పక్కింటి కామాక్షమ్మతో మాట్లాడుతున్నది. శివరాం, భార్యా మరదళ్ళతో కలిసి తల్లి దగ్గరకుపోయి, "అమ్మా, పండగకు నీకు కొత్తచీర తెచ్చాను. నీరజ పెళ్ళిలో తనకు అమ్మావాళ్ళు పెట్టిన చీరల్లో ఒక కొత్తచీర వున్నదట. అది కట్టుకుంటుంది," అన్నాడు.

అనసూయమ్మ ఏదో అనబోయేంతలో కామాక్షమ్మ కల్పించుకుని, "వదినా! కొడుకంటే ఇలా వుండాలి! పెళ్ళానికి వాళ్ళ అమ్మావాళ్ళిచ్చిన చీరతో సరిపెట్టి, నీకు మాత్రం కొత్తచీర తెచ్చాడు. ఈ విషయంలో నీ కొడుకూ, కోడల్నీ మెచ్చుకోవాల్సిందే!" అని, శివరాంతో, "అదే చేత్తో నీ మరదలు గిరిజకు ఒక చీర తీసుకురాకూడదూ?" అన్నది.

ఆ వెంటనే అనసూయమ్మ, కామాక్షమ్మ ముందు తన మంచితనం ప్రదర్శించాలనుకుని, "గిరిజకు చీర తెమ్మని చెబుదామని మరిచిపోయాను. పండక్కి ఈ చీర గిరిజ కట్టుకుంటుంది," అంటూ చీరను గిరిజ చేతికి అందించింది. ఈ విధంగా తమ ఉపాయం పారినందుకు శివరాం, నీరజ చాలా సంతోషించారు. — ఎం.రాజేశ్వరి



# 20-వ శతాబ్దంలో భారతదేశం

## స్వయంపాలన నుంచి సర్వ సత్తాక గణతంత్రరాజ్య అవతరణ వరకు 1923 - 1950

ఊరేగింపులలో త్రివర్ణ పతాకాలను తీసుకువెళ్ళరాదన్న ప్రభుత్వ నిషేధాన్ని వ్యతిరేకిస్తూ 1923 వ సం॥లో కాంగ్రెస్ కార్యకర్తలు నాగ్‌పూర్‌లో ఊరేగింపు జరిపారు.వాళ్ళను పోలీసులు ఖైదుచేశారు. దేశవ్యాప్తంగా జూలై 18వ తేదీ 'పతాకదినం' అనుసరించబడింది.ఆ తరవాత ప్రభుత్వం ఆ నిషేధాన్ని ఉపసంహరించుకున్నది.

మౌలానా అబుల్ కలామ్ ఆజాద్ అధ్యక్షతలో ఢిల్లీలో కాంగ్రెస్ ప్రత్యేక సమావేశం జరిగింది.తమ వ్యక్తిగత హోదాతో లెజిస్లేటివ్ కౌన్సిల్ ఎన్నికలలో పోటీ చేయడానికి కాంగ్రెస్ సభ్యులు అనుమతించబడ్డారు. ప్రభుత్వ అణచివేత చర్యలను ఎదుర్కొనడానికి అహింసాత్మక సత్యాగ్రహం ఒక్కటే మార్గమని ఆ సమావేశంలోనే నిర్ణయించబడింది.



మౌలానా ఆజాద్

స్వాతంత్ర్యం కోసం పోరాడుతూన్న వివిధ పార్టీల, బృందాల మధ్య సమన్వయం లేదన్న అభిప్రాయం 1924 నాటికి చాలామందిలో కలిగింది. గాంధీజీ, కాంగ్రెస్ నుంచి విడిపోయిన స్వరాజ్ పార్టీ నాయకులతో- పరస్పర సహకారంతో కృషి చేయవలసిన అవసరం గురించి చర్చలు జరిపాడు. సహాయ నిరాకరణోద్యమాన్ని తాత్కాలికంగా ఉపసంహరించాలని కూడా నిర్ణయించారు.

ఆ తరవాత జరిగిన బెల్గాం కాంగ్రెస్ సమావేశానికి గాంధీజీ అధ్యక్షత వహించాడు. ఆ సందర్భంగా ఆయన-సహాయ నిరాకరణోద్యమం;శాసనోల్లంఘనోద్యమం కల్పవృక్షానికి రెండు శాఖల్లాంటివనీ,అవి సత్ఫలితాలనే ఫలాలను ఇవ్వగలవనీ అభివర్ణించాడు. హిందూ-ముస్లిం ఐకమత్యం, మద్యపాన నిషేధం, అస్పృశ్యతా నిర్మూలన మొదలైన వాటికి కృషి చేయాలని నిర్ణయించారు.

# సంపూర్ణ స్వాతంత్ర్యం తప్ప మరేదీ వద్దు!


సరోజినీనాయుడు

1925 డిసెంబర్ 26వ తేదీ శ్రీమతి సరోజినీనాయుడు అధ్యక్షతన కాంగ్రెస్ 40-వ సమావేశం జరిగింది. స్వాతంత్ర్య సమరంలో భయం,అనుమానాలకుచోటేవుండ కూడదు. అది ఆత్మవంచన లాంటిది అని ఆమె కాంగ్రెస్ కార్యకర్తలను ఉద్బోధించింది. లక్ష్యసాధనకు ఉద్యమించాలని ఆమె దేశ ప్రజలకు పిలుపునిచ్చింది.

1926వ సం॥కాంగ్రెస్ సమావేశానికి అనుబంధంగా అఖిల భారత కళాశాల విద్యార్థుల సమావేశం ఏర్పాటు చేయబడింది. ప్రభుత్వం నడుపుతూన్న విద్యాలయాలను బహిష్కరించాలనీ ; సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడానికి విద్యాలయాలను బహిష్కరించి చదువు మానేసిన విద్యార్థుల కోసం పాఠశాలలు, కళాశాలలు నెలకొల్పాలనికూడా నిర్ణయించడం జరిగింది.

1927 వసం॥లోజవహర్‌లాల్‌నెహ్రూ అధ్యక్షతన మద్రాసు కాంగ్రెస్ సమావేశం జరిగింది. సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించేం తవరకు విశ్రమించేది లేదని నెహ్రూ ప్రవేశపెట్టిన తీర్మానం నెరవేరింది. అలాంటి కోరికనుసాధికారతీర్మానంగా ప్రవేశపెట్టడం అదే ప్రథమం. మింటోమార్లే సంస్కరణలు అమలు జరిగిన పైనాన్ని పరిశీలించడానికి, భారత్ పర్యటనకు వస్తూన్న సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని కూడా ఈ సమావేశం ప్రజలకు పిలుపునిచ్చింది.

1928 వసం॥లో ఢిల్లీలో జరిగిన అఖిల పక్ష సమావేశం- భారతదేశంలో స్వతంత్రమైన, బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి వీలుగా రాజ్యాంగాన్ని రూపొందించుకోవాలని తీర్మానించింది. రాజ్యాంగ రచనకు మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతలో ఒక కమిటీ ఏర్పాటయింది. ఆ తరవాత జరిగిన సమావేశంలో ప్రవేశపెట్టిన రాజ్యాంగ పత్రాన్ని ముస్లిం లీగ్ నాయకుడు మహమ్మదాలీ జిన్నాతప్ప తక్కిన వారందరూ ఆమోదించారు. ముస్లింలకు కొన్ని నియోజక వర్గాలను రిజర్వ్ చేయాలని జిన్నా కోరాడు. ఆ కోరిక నిరాకరించబడింది.


జిన్నా

ఇండియా 'డొమినియన్ స్టేటస్' అంటే అధినివేశ ప్రతిపత్తితోనే తృప్తి చెందాలన్న సూచనకుకూడా కాంగ్రెస్ అభ్యంతరం తెలిపింది. గాంధీజీవంటి పెద్దతరం నాయకులు దానికి అంగీకరించారు. అయితే, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్ చంద్రబోస్ వంటి యువ తరం నాయకులు సంపూర్ణస్వాతంత్ర్యం తప్ప అంతకు తక్కువ మరేదీ వద్దని పట్టుబట్టారు.

1928లో వల్లభాయిపటేల్ నాయకత్వంలో గుజరాత్ బర్డోలీ రైతులు పన్నులు చెల్లించడానికి నిరాకరించడంతో స్వాతంత్ర్య పోరాటం కొత్త మలుపు తిరిగింది. పన్నులు వసూలుచేయడానికి వచ్చిన అధికారులకు భోజనసదుపాయాలూ, రవాణాసౌకర్యాలూ కల్పించడానికి సైతం రైతులు అడ్డుపడ్డారు. దాంతో ప్రభుత్వం రైతుల స్థిర, చరాస్తులను వశపరచుకున్నది. మరెన్నో విధాలుగా రైతులను బెదిరించింది. త్వరలో పన్నుల విధానంలో కొన్ని మార్పులు, చేర్పులు చేయగలమని ప్రభుత్వం మాట ఇచ్చాక వ్యతిరేక ఉద్యమం ఆగింది.


వల్లభాయిపటేల్

1929 డిసెంబర్ 31వ తేదీ జవహర్‌లాల్‌నెహ్రూ అధ్యక్షతన జరిగిన 44వ కాంగ్రెస్ సమావేశంలో భారత్‌ను స్వతంత్ర దేశంగా 'ప్రకటించి' అర్ధరాత్రి సమయంలో త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయడం జరిగింది. బ్రిటిష్‌సామ్రాజ్యవాదం నుంచి స్వతంత్రం; బ్రిటిష్ సామ్రాజ్యంనుంచి విడిపోవడం- లక్ష్యాలుగా ఆయన ప్రకటించాడు. జనవరి 26వ తేదీని స్వతంత్ర దినంగా జరుపుకోవాలని నిర్ణయించారు.

# బయటి ప్రపంచంలో.....



- 1925 అక్టోబర్ 2వ తేదీ జాన్ లోగీ బైయిర్డ్ దూరంగా ఉంచిన తెరమీద కదిలేబొమ్మలనుప్రతిసృష్టిచేయడం ద్వారా టెలివిజన్ పుట్టింది.



- 1927 మే 21వతేదీ చార్లెస్ లిండ్ బెర్గ్ ఒకే ఇంజనుగల స్పిరిట్ ఆఫ్ సెయింట్ లూయిజ్ అనే విమానంలో న్యూయార్క్ లోని లాంగ్ ఐలాండ్ నుంచి ఒంటరిగా బయలుదేరి 3,600 మైళ్ళ దూరంలో వున్న ప్యారీస్‌కు ఎక్కడా విరామం లేకుండా 33½ గంటలసేపు ప్రయాణం చేసి నూతన విమానయాన చరిత్ర సృష్టించాడు.

# శాసనోల్లంఘన ప్రారంభం

1930 ఫిబ్రవరిలో సబర్మతిలో జరిగిన కాంగ్రెస్ కార్యవర్గ కమిటీ సమావేశం-శాసనోల్లంఘన ఉద్యమాన్ని చేపట్టాలని నిర్ణయించింది. ఉప్పు పన్ను చట్టాన్ని అతిక్రమించాలనుకున్న గాంధీజీని ఆ



ఉద్యమానికి నాయకత్వం వహించమని కోరింది. మార్చ్ 12 వ తేదీ 78 మందిఅనుచరులతో గాంధీజీ 200 మైళ్ళ దూరంలో వున్న దండికి కాలినడకన బయలుదేరాడు. ఇరవైనాలుగురోజుల తరవాత వాళ్ళు దండిని చేరుకున్నారు.ఏప్రిల్ 6వ తేదీ గాంధీజీ, ఆయనఅనుచరులూ సముద్రజలాలనుంచి ఉప్పు తయారు చేసి-ఉచితంగా సముద్రం నుంచి లభించే ఉప్పు మీద కూడా పన్ను విధించే దారుణ చట్టాన్ని అతిక్రమించారు. ఒక నెల తరవాత ప్రభుత్వం గాంధీజీని ఖైదు చేసింది.



నవంబర్ 12వ తేదీ లండన్‌లో జరిగిన మొదటి రౌండ్ టేబుల్ సమావేశాన్ని కాంగ్రెస్ బహిష్కరించింది. లెజిస్లేటివ్ కౌన్సిల్స్ అన్నిటిలోనూ మూడోవంతు స్థానాలను ముస్లింలకు కేటాయించాలని జిన్నా కోరాడు. హిందూ మహాసభ ఆ కోరికకు అభ్యంతరం తెలిపింది.

గాంధీజీ— వైస్రాయ్ లార్డ్ఇర్విన్‌ల మధ్య ఒక ఒప్పందం కుదరడంతో శాసనోల్లంఘనోద్యమం ఉపసంహరించుకోబడింది. అణచివేత చర్యలన్నిటినీ వదులుకుంటామని ప్రభుత్వం మాట ఇచ్చింది.

1931లో లండన్‌లో జరిగిన రెండవ రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధీజీ హాజరయ్యాడు. సంఘసంస్కరణలు అమలు జరిగాకే, స్వయంపాల

నాధికారాన్ని ఇవ్వవచ్చునని ప్రభుత్వం తెలియజేసింది. రాజకీయ సంస్కరణలు ప్రవేశ పెట్టేంతవరకు సంఘసంస్కరణలు ఆగవచ్చునని గాంధీజీ వాదించాడు.

కొత్తగా వచ్చిన వైస్రాయ్ లార్డ్ విల్లింగ్డన్, గాంధీ-ఇర్విన్ ఒప్పందాన్ని ఏమాత్రం గౌరవించకుండా-వ్యతిరేక ఉద్యమాలనూ, అలజడులనూ, ప్రదర్శనలనూ నిషేధిస్తూ 1932 జనవరిలో నాలుగు ఉత్తరువులను జారీచేశాడు. శాసనోల్లంఘన ఉద్యమాన్ని మళ్ళీ చేపట్టాలని కాంగ్రెస్ భావించింది. కాంగ్రెస్‌పార్టీని చట్టవిరుద్ధమైనదిగా ప్రభుత్వం ప్రకటించింది. దేశ వ్యాప్తంగా వివిధప్రాంతాలలో దాదాపు 400 మంది కాంగ్రెస్ కార్యకర్తలు ఖైదుచేయబడ్డారు.



• భారతీయ భౌతిక శాస్త్రవేత్త సి.వి.రామన్‌కు భౌతిక శాస్త్రంలో (రామన్ ఎఫెక్ట్) 1930వ సం॥ నోబెల్ బహుమతి లభించింది. ఆసియా ఖండంలోనే ప్రప్రథమంగా సర్ సి.వి.రామన్ ఈ ప్రతిష్ఠాత్మకమైన బహుమతిని అందుకున్నాడు.

# బయటి ప్రపంచంలో.....

1928 సెప్టెంబర్ లో న్యూయార్క్‌లో ప్రదర్శించిన సౌండ్ కార్టూన్ సినిమాలో మొట్టమొదటిసారిగా మిక్కీమౌస్ కనిపించింది. అంతకు పూర్వం నిర్మించిన రెండు నిశ్శబ్ద చలన చిత్రాలు వినియోగదారులను ఆకర్షించలేక పోయాయి.



• 1928 అలెగ్జాండర్ ఫ్లెమింగ్, పెన్సిలిన్ మందును కనుగొన్నాడు. ఈ మందును గాయాలు మాన్పడానికి ఉపయోగించి విజయం సాధించారు.



• 'అలిస్ ఇన్ వండర్ ల్యాండ్' పుస్తకం అసలు వ్రాతప్రతులు 15,400 డాలర్లకు అమ్ముడు పోయాయి. (1928)

# రాష్ట్రాల(ప్రావిన్సెస్)లో తొలి మంత్రిమండలులు

1933 మే నెలలో గాంధీజీ జైల్లోనే నిరాహారదీక్ష ప్రారంభించాడు. అది ఇరవై ఒక్క రోజులు కొనసాగింది. శాసనోల్లంఘన ఉద్యమాన్ని రెండవసారి ఉపసంహరించాడు. గాంధీజీ జైలునుంచి విడుదల అయ్యాక-దళిత జనోద్ధరణకు పాటుపడగలనని ప్రకటించాడు. దళితులకు హరిజనులని పేరుపెట్టాడు.

1934 మే నెలలో జరిగిన పాట్నా సమావేశంలో సోషలిస్టు అభిమానులు కొందరు విడిగా సమావేశమై కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పాటు చేశారు. భారత్‌కు సంపూర్ణ స్వతంత్రం; శాసన సభల ఏర్పాటు;సోషలిస్టు సమాజ నిర్మాణం తమ లక్ష్యాలుగా చాటారు. జయప్రకాశ్ నారాయణ్ పార్టీ అధ్యక్షుడయ్యాడు.


జయప్రకాశ్

అక్టోబర్ నెలలో బొంబాయిలో జరిగిన 48వ కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ రాజీనామా చేస్తున్నట్టు ప్రకటించాడు. సెంట్రల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు నవంబర్‌లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ అధిక స్థానాలు గెలుచుకున్నది.

1936వ సం॥లో లక్నో కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన జవహర్‌లాల్ నెహ్రూ- కార్మిక, కర్షక సంఘాలకు పార్టీ సభ్యత్వం ఇవ్వాలని సూచించాడు. ఆ సమావేశంలో వామపక్షభావాలుగల సభ్యులు అధిక సంఖ్యలో కనిపించారు. సోషలిస్టు భావాలుగల యువకులయిన జయప్రకాశ్ నారాయణ్, అచ్యుతపట్వర్ధన్‌లను కార్యవర్గ కమిటీలో చేర్చుకున్నారు.

యువతీ యువకులను స్వాతంత్ర్యోద్యమంలో పాలుపంచుకోమని ప్రోత్సహించడానికి వీలుగా అఖిల భారత విద్యార్థి సమాఖ్య ప్రారంభించబడింది.

1937లో జరిగిన ఎన్నికలలో మెజారిటీ వచ్చిన కొన్ని ప్రాంతాలలో కాంగ్రెస్-మంత్రి మండలులు ఏర్పాటు చేసింది. మొత్తం 1,585 స్థానాలలో 715 స్థానాలను కాంగ్రెస్ గెలుచుకున్నది. ముస్లింలీగ్‌కు 123 స్థానాలు లభించాయి. యునైటెడ్ ప్రావిన్సెస్‌లో జవహర్‌లాల్ నెహ్రూ సోదరి విజయలక్ష్మీ పండిట్ ఆరోగ్యశాఖామంత్రి పదవిని చేపట్టి తొలి మహిళా మంత్రి అయ్యారు. అక్టోబర్‌లో జరిగిన వార్ధా సమావేశానికి


విజయలక్ష్మీ పండిట్

అధ్యక్షతవహించిన గాంధీజీ, నూతన విద్యావిధానాన్ని ప్రతిపాదించాడు. 'బేసిక్ ఎడ్యుకేషన్'గా పిలువబడిన ఈ విద్యా విధానంలో వృత్తి విద్యలకూ, స్వదేశ సంప్రదాయాలకూ అధిక ప్రాధాన్యతకల్పించబడింది. వార్ధాలోనే మొట్టమొదటి 'బేసిక్ స్కూల్' నెలకొల్పబడింది.

కాంగ్రెస్ ఉద్యమ ప్రభావం, ఐదువంద లకు పైగా వున్న స్వదేశ సంస్థానాలకు కూడా వ్యాపించింది. కాంగ్రెస్ కార్యకర్తలు అక్కడక్కడా చిన్న చిన్న కమిటీలను ఏర్పరచారు. అయితే బ్రిటిష్ ప్రభుత్వానికి అనుకూలంగా వున్న పాలకులు కొందరు కాంగ్రెస్ కార్యకలాపాలను అనుమతించలేదు.మైసూరు, తిరువాన్కూరు మొదలైనసంస్థానాధిపతులు కాంగ్రెస్ కార్యకర్తలపై తీవ్రచర్యలు తీసుకున్నారు. వాళ్ళ కార్యకలాపాలను హింసాత్మకంగా అణచివేయడానికి కూడా ప్రయత్నించారు.

హరిపురలో జరిగిన కాంగ్రెస్(1938) సమావేశంలో ఈ విషయం పట్ల తీవ్ర ఆందోళన వ్యక్తం చేయబడింది. పార్టీ సంస్థానాల శాఖలకు పూర్తి మద్దతు అందజేయాలని నెహ్రూ కోరాడు.

- 1933 జనవరి 8వ తేదీ ఉజ్వలమైన రోజు; మన సామాజిక చరిత్రలో అది చిరస్మరణీయమైనది. ఆరోజే కాంగ్రెస్ కోరిన విధంగా కుల విచక్షణ లేకుండా హిందువులందరూ ఆలయాలలోకి అనుమతించబడ్డారు.

## బయటి ప్రపంచంలో.....



- జర్మనీలో తయారైన జెప్‌లిన్ 'వాయునౌక 21రోజులలో ప్రపంచాన్ని చుట్టి వచ్చింది.(1929)
- అమెరికా అంతరిక్ష శాస్త్రవేత్త క్లైడ్ టోమ్‌బాగ్ తొమ్మిదవ గ్రహం ప్లూటో వున్న విషయం కనుగొన్నాడు.
- డాన్ బ్రాడ్మన్ ఒక్క ఇన్నింగ్స్‌లో కూడా అవుట్ కాకుండా 452 పరుగులు తీసి ప్రపంచరికార్డు సృష్టించాడు. ఆయన క్వీన్స్‌లాండ్‌కు వ్యతిరేకంగా న్యూ సౌత్ వేల్స్ పక్షంలో బ్యాట్ చేసి 415 నిమిషాలలో 49 బౌండరీలు కొట్టాడు. (1930)

- క్లేటాన్ ఎఫ్.సమ్మీ ''హ్యాపీ బర్త్‌డే టూ యూ'' గీతాన్ని రచించాడు. (1924)
- ఇంగ్లీష్ ఛానెల్‌ను ఈదిన తొలి మహిళగా గెర్ట్రూడ్ ఈడెర్లీ పేరు తెచ్చుకున్నది. (1926)

# కాంగ్రెస్‌లో నాయకత్వం కోసం పోట్లాట

మొట్టమొదటిసారిగా కాంగ్రెస్‌లో నాయకత్వం కోసం పోట్లాట ఆరంభమయింది. గాంధీజీ నాయకత్వంలోని మితవాద పక్షం, పట్టాభి సీతారామయ్యను అధ్యక్ష పదవికి నామినేట్ చేసింది. అతివాదులమద్దతుతో సుభాస్ చంద్రబోస్ పోటీ చేసి పూర్తి ఆధిక్యతతో నెగ్గాడు. దీనిని గాంధీజీ తన వ్యక్తిగత ఓటమిగానే భావించాడు.



సుభాస్ చంద్రబోస్

1939 త్రిపురలో 52వ సమావేశం జరిగింది. గాంధీజీ పట్ల సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటిస్తూ, కార్యవర్గ కమిటీ సభ్యులను ఏర్పాటు చేసే అధికారాన్ని ఆయనకు అప్పగిస్తూ ఈ సమావేశంలో ఒక తీర్మానం ఆమోదించబడింది. ఈ తీర్మానం అధ్యక్షుడి పట్ల విశ్వాసరాహిత్యాన్ని సూచిస్తున్నట్టు సుభాస్ చంద్రబోస్ మద్దతుదార్లు భావించారు. స్వతంత్రంగా వ్యవహరించలేమని గ్రహించాక, సుభాస్ చంద్రబోస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి 'ఫార్వర్డ్ బ్లాక్' పార్టీ స్థాపించాడు.ఆయన్ను కాంగ్రెస్, పార్టీనుంచి తొలగించింది.

సెప్టెంబర్‌లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే ప్రాంతీయ ప్రభుత్వాలన్నిటినీ వైస్రాయ్ రద్దు చేస్తూ, యుద్ధంలో ఇండియా ఇంగ్లాండుకు మద్దతు తెలియజేయాలని ప్రకటించాడు. యుద్ధ ప్రభావం ప్రజలపై ఎలా వుంటుందో ప్రభుత్వం స్పష్టం చేస్తేనే ప్రజలు దానికి మద్దతు నివ్వడం సాధ్యం అని కాంగ్రెస్ కార్యవర్గ కమిటీ ఆదేశించింది. వెంటనే భారతదేశ స్వాతంత్ర్యాన్ని ప్రకటించాలనీ, అల్ప సంఖ్యాకుల అవసరాలనూ, అభిలాషలనూ పరిరక్షించాలనీ కోరింది.

యుద్ధం ఒక సంవత్సరం సాగాక, తక్షణ మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు కోరికను కాంగ్రెస్ మళ్ళీ లేవనెత్తింది.

ఇది జరగలేదంటే మళ్ళీ శాసనోల్లంఘనం తప్పదని హెచ్చరించింది. అయితే, గాంధీజీ, నెహ్రూ ఉభయులూ - బ్రిటన్ యుద్ధంలో నిమగ్నమై ఉన్నప్పుడు శాసనోల్లంఘనం చేయడం భావ్యంకాదని భావించారు.

యుద్ధం ముగియగానే,భారతరాజ్యాంగంకోసం ప్రతినిధుల సభ ఏర్పాటు చేయగలమని వైస్రాయ్ లార్డ్ లిన్లిత్‌గో కాంగ్రెస్‌కు హామీ ఇచ్చాడు.

ప్రభుత్వ వ్యతిరేక సామూహిక ఉద్యమాలకు బదులు, వ్యక్తులే శాసనోల్లంఘనానికి పూనుకోవచ్చునని గాంధీజీ ప్రతిపాదించాడు. దానిని సెప్టెంబర్ నెలలో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ కమిటీ సమావేశం ఆమోదించింది.



వినోబా భావే

సత్యాగ్రహనిర్వహణకు గాంధీజీ వ్యక్తులను ఎంపిక చేశాడు. వినోబా భావేను ఆయన ప్రథమ సత్యాగ్రహిగా సాగనంపాడు. వార్ధా సమీపంలోని పన్వార్ నుంచి వినోబా భావే పాదయాత్రను ప్రారంభించాడు. నాలగవ రోజున ఖైదు చేయబడ్డాడు.

సత్యాగ్రహం ప్రారంభించడానికి ముందే జవహర్‌లాల్ నెహ్రూను ఖైదు చేశారు. ఆ తరవాత వల్లభాయి పటేల్, సి.రాజగోపాలాచారి, మౌలానా అబుల్ కలాం ఆజాద్ మొదలైన నాయకులు చెరసాలల పాలయ్యారు.

- ప్రభుత్వ కార్యాలయాలు, కొత్తగా నిర్మించిన న్యూఢిల్లీకి 1931లో మార్చబడ్డాయి.
- నూతన రాజధాని ప్రారంభోత్సవానికి గుర్తుగా ఇండియాలోనే మొట్ట మొదటిసారిగా న్యూఢిల్లీ బొమ్మల స్టాంపులు (6) విడుదల చేయబడ్డాయి.

# బయటి ప్రపంచంలో.....

- వార్తాపత్రికలలో అడపాదడపా వ్యంగ్య చిత్రాలు, కామిక్స్ వస్తూ ఉన్నప్పటికీ పుస్తకం మొత్తం కామిక్స్‌తో 1934లోనే వెలువడింది. 68 పుటల ఆ పుస్తకం పేరు 'ఫేమస్ ఫన్నీస్'.



- ప్రపంచంలోనే అతి పెద్ద (4,200 అడుగులు) వేలాడే వంతెన గోల్డెన్ గేట్ బ్రిడ్జ్, శాన్ ఫ్రాన్సిస్కోలో రాకపోకలకు తెరువబడింది. (1937)
- బర్మా (ఇప్పటి మియాన్ మార్) ఇండియా నుంచి విడిపోయింది.
- అమెరికాలో బెర్నార్డ్ ఫాస్టెస్ ప్రప్రథమంగా 'బ్లడ్ బ్యాంక్' ఏర్పాటు చేశాడు. (1937)

# స్వాతంత్ర్య పోరాటానికి సర్వత్రా ఆదరణ!

కలకత్తాలో గృహ నిర్బంధంలో వున్న సుభాస్ చంద్రబోస్ 1941 జనవరి 17వ తేదీ ఎవరికీ తెలియకుండా తప్పించుకుని మారువేషంతో పెషావర్, కాబూల్, మాస్కో గుండా ప్రయాణం చేసి బెర్లిన్ చేరుకున్నాడు. అక్కడ స్వతంత్ర భారత్ కేంద్రం (ఫ్రీ ఇండియా సెంటర్) స్థాపించి, దానికి అనుబంధంగా భారత్ సేన (ఇండియా లిజియన్) ను నడిపాడు. 'ఆజాద్ హింద్' రేడియో ద్వారా ప్రసారాలు ప్రారంభించాడు.

ఇండియా స్వాతంత్ర్యం కోరడంలోని న్యాయం గురించీ; అహింసాయుతంగా స్వాతంత్ర్య పోరాటం సాగుతూన్న విలక్షణ మార్గం గురించీ ప్రపంచ దేశాల నేతలు మాట్లాడ సాగారు. 1942లో ఇండియా పర్యటన ముగించిన తరవాత చైనీస్ రిపబ్లిక్ ప్రెసిడెంట్ చియాంగ్-తాయ్-షెక్ అధికారాన్ని ప్రజలకు అప్పగించమని బ్రిటన్‌కు విజ్ఞప్తి చేశాడు. అమెరికా ప్రెసిడెంట్ ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్- కనీసం 'డొమినియన్ స్టేటస్'.అయినా ఇచ్చి వెంటనే మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు చేయమని బ్రిటిష్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్‌ను కోరాడు. బ్రిటిష్ పార్లమెంటులో సైతం అధిక సంఖ్యాకులు- ఇండియాలో జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేయాలని కోరారు.

వెంటనే దేశం వదిలి వెళ్ళమని బ్రిటిష్ వారిని కోరాలి; మళ్ళీ గాంధీజీకి నాయకత్వం అప్పగించి ప్రజాఉద్యమాన్ని ప్రారంభించాలి- అని కార్యవర్గ కమిటీ చేసిన తీర్మానాలను బొంబాయి కాంగ్రెస్ సమావేశం ఆమోదించింది. ఆగస్ట్ 9వ తేదీ "భారత దేశాన్ని వదిలిపో!" అనే (క్విట్ ఇండియా) శంఖారావం దేశం నలుమూలలా ప్రతిధ్వనించింది. రాత్రికి రాత్రే నాయకులందరూ ఖైదుచేయబడ్డారు. హింసాత్మక సంఘటనలు కూడా జరిగాయి.

గాంధీజీ జైలు నుంచే వైస్రాయ్‌తో చర్చలు కొనసాగించాడు. సానుకూల సమాధానం రాకపోయేసరికి గాంధీజీ 1943 ఫిబ్రవరిలో 21 రోజుల నిరాహారదీక్షను ప్రకటించాడు. రోజురోజుకూ ఆయన ఆరోగ్యం క్షీణించసాగింది. ఏ రాజకీయ పక్షాలకూ చెందని పలువురు ప్రముఖులు, గాంధీజీతో సహా నాయకులందరినీ విడుదల చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. వైస్రాయ్ కార్యనిర్వాహక వర్గంలో వున్న భారతీయ సభ్యులు కొందరు రాజీనామా చేశారు.

ఓడలలో, జలాంతర్గాములలో, విమానాలలో ఎన్నో ఆటంకాలతో ప్రయాణం సాగిస్తూ సుభాస్ చంద్రబోస్ జపాను చేరుకున్నాడు. ఇండియా స్వాతంత్ర్యం సాధించడానికి కావలసిన సహాయాన్ని అందించగలమని జపాను ప్రధాని టోజో సుభాస్‌కు మాట



నేతాజీ బోస్

ఇచ్చాడు. అదే సమయంలో, రాష్ బిహారీ బోస్-ఇండియా ఇండిపెండెన్స్ లీగ్‌ను థాయ్ రాజధాని బ్యాంకాక్ నుంచి సింగపూర్‌కు మార్చాడు. జూలై 2వ తేదీ సుభాస్ చంద్ర బోస్ అక్కడికి వచ్చినప్పుడు భారత జాతీయ సేన ఆయనకు గౌరవసైనిక వందనం చేసింది. సుభాస్‌ను 'నేతాజీ' అని పిలిచింది. నేతాజీ 'ఢిల్లీ ఛలో' పిలుపు నిచ్చాడు. సింగపూర్‌లో 'ఆజాద్ హింద్' ప్రభుత్వాన్ని నెలకొల్పి నట్టు అక్టోబర్ 21వ తేదీ ప్రకటించాడు.

- 1935లో ఢిల్లీ - నైనిటాల్ జాతీయ రహదారి మీద జాతీయ ఉద్యానం ఏర్పడింది. హైలీ నేషనల్ పార్క్ అన్న దీని పేరును 1957లో కార్బెట్ నేషనల్ పార్క్‌గా మార్చారు.



- కులపతి కె.యం.మున్షీ 1938లో భారతీయ విద్యాభవన్‌ను స్థాపించాడు.

# బయటి ప్రపంచంలో.....

- థాయ్‌లాండ్, మలయా, జపాను మొదలైన దేశాలలో స్థిరపడిన భారతీయులు 'ఇండియా ఇండి పెండెన్స్ లీగ్' శాఖలుప్రారంభించి,వాటికినాయకత్వం వహించమని సుభాస్ చంద్ర బోస్‌ను ఆహ్వానించారు. (1942)



- రెండవ ప్రపంచ యుద్ధానికి కారకులైన ఇద్దరూ దుర్మరణం పాలయ్యారు. జర్మనీ నాజీ పాలకుడు అడోల్ఫ్ హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు. ఇటలీనియంత ముసోలినీ హత్యకు గురయ్యాడు. 1945 మే 7వ తేదీ జర్మనీ లొంగిపోయింది. జపాను పట్టువదలలేదుకాని, ఆగస్ట్ 6,9 తేదీలలో హిరోషిమా, నాగసాకీలపై ప్రయోగించిన బాంబులు అపార జన, ధన నష్టాలను కలిగించడంతో ఆ దేశం కూడా ఆగస్ట్ 14న లొంగిపోయింది.

# అధికార మార్పిడికి పథకం!

జాతీయ ప్రభుత్వ ఏర్పాటుకు ముస్లిం లీగ్ సుముఖంగాలేదని బ్రిటిష్ ప్రభుత్వం వాదిస్తూ వచ్చింది. సి.రాజగోపాలాచారి ముస్లిం నాయకులతో చర్చించి, సి.ఆర్. ఫార్ములా అనే ఒక పరిష్కారాన్ని ప్రభుత్వం



సి.రాజగోపాలాచారి

ముందు ఉంచాడు. మధ్యంతర ప్రభుత్వానికి ముస్లిం లీగ్ మద్దతు నివ్వాలి. యుద్ధానంతరం - ముస్లింలు అధిక సంఖ్యాకులుగావున్న ప్రాంతాలు విడిపోయి ప్రత్యేక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవాలి. ఇదీ ఆ ఫార్ములా అంశాలు. అయితే, లీగ్ ప్రెసిడెంట్ జిన్నా ఆ ఫార్ములాను అంగీకరించలేదు. మొదట పాకిస్తాన్‌ను ఏర్పాటు చేసి ఆ తరవాత స్వతంత్రం ఇవ్వాలన్నాడు. 1944 సెప్టెంబర్‌లో గాంధీజీ జిన్నాతో చర్చలు జరిపాడు. కాని, ఫలితం లేకపోయింది. కాంగ్రెస్ - ముస్లిం లీగ్ సమాన ప్రాతినిధ్యంతో మధ్యంతర ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయవచ్చునని భులాబాయ్ దేశాయ్ కాంగ్రెస్ తరఫున సూచించాడు.

'ఆజాద్ హింద్' ప్రభుత్వ ప్రధాన కార్యాలయం సింగపూర్ నుంచి బర్మా రాజధాని రంగూన్‌కు మార్చబడింది. భారత జాతీయ సేన భారత్ సరిహద్దులను చేరి మణిపూర్‌లోని మొయిరెంగ్‌లో 'త్రివర్ణ పతాకను' ఎగుర వేసింది. 1944 జూన్ 6వ తేదీ నేతాజీ రంగూన్ నుంచి రేడియోలో ప్రసంగించాడు. అప్పుడే ఆయన గాంధీజీని 'జాతి పిత' గా అభివర్ణించాడు.

కొత్త వైస్రాయ్ లార్డ్ వేవెల్ బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చించిన తరవాత, 1945లో అధికార మార్పిడికి ఒక పథకాన్ని ప్రకటించాడు. ఇది కేవలం తాత్కాలికమైనదేకానీ, నూతన రాజ్యాంగ రూపకల్పనకు ఏమాత్రం ప్రతిబంధకం కాదనీ స్పష్టం చేశాడు; కార్యనిర్వాహక వర్గంలో కాంగ్రెస్‌కూ, ముస్లిం లీగ్‌కూ సమాన ప్రాతినిధ్యం వుంటుంది. వైస్రాయ్, కమాండర్-ఇన్-ఛీఫ్ ఇద్దరు మాత్రమే ఆంగ్లేయులు. తక్కిన వాళ్ళందరూ భారతీయులే.

సిమ్లాలో అఖిలపక్ష సమావేశం ఏర్పాటయింది. పాకిస్తాన్ ఏర్పాటు తప్ప తక్కిన దేనినీ అంగీకరించమని జిన్నా తేల్చి చెప్పాడు. ఈ సమావేశానంతరం క్విట్

ఇండియా ఉద్యమం కారణంగా ఖైదు చేయబడిన వాళ్ళందరూ విడుదల చేయబడ్డారు.

రాష్ట్ర గవర్నర్ల సమావేశం సాధారణ ఎన్నికలు జరపాలని కోరింది. వైస్రాయ్ అంగీకరించాడు. కాంగ్రెస్ ఎన్నికలలో పాల్గొనాలని నిర్ణయించింది. కాని, మిగిలిన సూచనలన్నింటినీ తోసిపుచ్చింది.



• జలియన్ వాలాబాగ్ దురంతాలలో నిరాయుధులైన ప్రజలపై కాల్పులు జరపమని ఆజ్ఞాపించినవాడు, అప్పటి పంజాబు గవర్నర్ మైకేల్ ఒ.డయ్యర్. ఆ దురంతాలలో గాయపడిన వాళ్ళలో సర్దార్ ఉద్దమ్ సింగ్ అనే శిక్కు కూడా ఒకడు. ఆ దుర్ఘటన జరిగిన 21 సం॥ల తరవాత 1940లో లండన్‌లోని ఒక థియేటర్‌లో డయ్యర్‌ను కాల్చి చంపి ఉద్దమ్ సింగ్ పగ సాధించాడు.

## బయటి ప్రపంచంలో.....

• 1946 జనవరి 10వ తేదీ ఐక్య రాజ్య సమితి ప్రథమ సమావేశం లండన్‌లో జరిగింది. 51 దేశాల ప్రతినిధులు హాజరయ్యారు. ఐక్య రాజ్య సమితి ప్రధాన కార్యాలయం న్యూయార్క్‌లో ఉండాలని నిర్ణయించారు.

• అమెరికాలోని ఒక కంపెనీ 'ఎలక్ట్రిక్ బ్లాంకెట్'ను కనుగొన్నది. (1946)

• ప్రథమ అంతరిక్షయానంలో గంటకు 1,200 కి.మీ. వేగం రికార్డయింది. (1947)

• వాతావరణం, ప్రకృతి సంరక్షణ కోసం ఐక్యరాజ్యసమితి ప్రకృతి పరిరక్షణ సంస్థ (యూనియన్ ఫర్ ది కన్సర్వేషన్ ఆఫ్ నేచర్)ను ఏర్పాటు చేసింది. (1948)

• అమెరికాలోని న్యూజెర్సీలో తొలి డ్రైవ్-ఇన్-థియేటర్ ఆరంభమయింది. (1933)
• మాస్కోలో మెట్రో (తొలి భూగర్భ రైల్వే) సర్వీస్ ఆరంభమయింది. (1935)
• జర్మనీలో మొట్టమొదటి ప్యాసెంజర్ హెలికాప్టర్ ఆకాశంలో ఎగిరింది. (1936)

## స్వాతంత్ర్య సిద్ధి!

ఢిల్లీ కేసి వస్తున్న భారత జాతీయ సేన (ఐ.ఎన్.ఏ)ను బ్రిటిష్ సైన్యం అడ్డుకున్నది. బ్రిటిష్ సేనలు బర్మా గుండా వస్తున్నాయని తెలియగానే, సుభాస్ రంగూన్ వదిలి బ్యాకాంక్ చేరుకున్నాడు. జర్మనీ లొంగుబాటు గురించి అక్కడ ఆయనకు తెలియవచ్చింది. ఆయన అక్కడినుంచి మలయాకు వెళ్ళాడు. జపాను లొంగిపోయిన విషయం ఆయనకు అక్కడ తెలిసింది. ఆయన సింగపూరుకు తిరిగివెళ్ళి, తన మంత్రులతో చర్చలు జరిపాడు. ఆయన్ను వెంటనే అజ్ఞాతానికి వెళ్ళమనీ, ఆ తరవాత వచ్చి విముక్తిసేనకు నాయకత్వం వహించ వచ్చుననీ వాళ్ళు సలహా ఇచ్చారు. సహాయం అందిస్తామని జపాను మాట ఇచ్చింది. ఆయన రష్యా ఆధీనంలోవున్న మంచూరియాకు బయలు దేరాడు. ఆయన ప్రయాణం చేస్తున్న విమానం తాయ్‌పీలో 1945 ఆగస్టు 22వ తేదీ ప్రమా దానికి లోనయింది. అందులో ఆయన మర ణించినట్టు వార్తలు వచ్చాయి గాని, ఈనాటికీ ఆయన మరణం గురించిన రహస్యం నిగూఢం గానే ఉండిపోయింది.

సెంట్రల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు 1946లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్‌కు 56 స్థానాలూ, ముస్లింలీగ్‌కు 30 స్థానాలూ లభించాయి. ప్రావిన్షియల్ కౌన్సిల్స్(రాష్ట్రాల)లో కాంగ్రెస్ 923 స్థానాలనూ, లీగ్ 425 స్థానాలూ గెలుచుకున్నాయి. బెంగాల్‌లో లీగ్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. పంజాబులో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. మిగిలిన రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. సింద్ ప్రాంతంలో లీగ్‌కు మెజారిటీ వచ్చినప్పటికీ ఎన్నికయిన సభ్యులు తరవాత కాంగ్రెస్‌లో చేరారు.

దేశనాయకులతో సంప్రతింపులు జరప డానికి ఇంగ్లాండు నుంచి త్రిసభ్య 'కేబినెట్ మిషన్' వచ్చింది. ఇండియన్ యూనియన్ ఏర్పాటు కావాలనీ, ముస్లింలకు ప్రత్యేక ప్రాంతాలు వద్దనీ కమిషన్ సూచించింది. మూడు ప్రాంతీయ కమిటీలు ఏర్పరచాలనీ, వారి ప్రతినిధులే రాజ్యాంగ పరిషత్తు కమిటీలో సభ్యులుగా వుంటారనీ, రాజ్యాంగం బ్రిటిష్ ప్రభుత్వానికి ఆమోదయోగ్యంగా వుంటుందనీ 'కేబినెట్ మిషన్' తెలియజేసింది.

మధ్యంతర ప్రభుత్వ ఏర్పాటు గురించి జూన్‌లో ప్రకటించారు. అయితే హిందువులూ, ముస్లింలూ కలిసి ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి జిన్నా ఒప్పుకోలేదు. నెహ్రూను మంత్రి మండలిని ఏర్పాటు చేయమని కోరారు. సెప్టెంబర్ 2వతేదీ మంత్రిమండలి పదవీప్రమాణ స్వీకారంచేసింది. ముస్లింలు దీనిని విషాద దినంగా పాటించారు. అయినప్పటికీ అక్టోబర్ 13వ తేదీ మంత్రిమండలిలో చేర డానికి తన సంసిద్ధతను లీగ్ తెలియజేసింది. పాకిస్తాన్ విభజనకు అది తొలిమెట్టుగా ఉండ గలదని వ్యాఖ్యానించింది.


జవహర్‌లాల్ నెహ్రూ

ఈ పరిస్థితి కొందరు ముస్లింలకు నచ్చ లేదు. పర్యవసానంగా కలకత్తా, బెంగాల్‌లోని

మరికొన్ని ప్రాంతాలలో మత కలహాలు ఆరంభమయ్యాయి. హిందువులు తిరగబడ్డారు. ముస్లిం జనాభా అధికంగావున్న నవకాళిలో హిందువులపై హింసాకాండ ప్రజ్వరిల్లింది. శాంతిసందేశంతో గాంధీజీ అక్కడికి చేరాడు. హిందూ-ముస్లిం ఐక్యతను ప్రబోధిస్తూ 17 గ్రామాలగుండా 120 మైళ్ళ దూరం కాలినడకనే పర్యటించాడు.


రాజేంద్రప్రసాద్

1946 డిసెంబర్ 11వ తేదీ రాజేంద్ర ప్రసాద్ రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు.

1947 జూన్ 2వ తేదీ వైస్రాయ్ లార్డ్ మౌంట్ బాటన్ అధికార మార్పిడికి తుది రూపం ఇవ్వడానికి మూడు ముఖ్యమైన పక్షాలైన కాంగ్రెస్, లీగ్, శిక్కు నాయకులతో సంప్రదింపులు జరిపాడు. మరునాడే ఆయన రేడియోలో ప్రసంగించాడు. అది జూన్ 3 ప్రసంగంగా ప్రసిద్ధిగాంచింది. అందులో- భారత ఉపఖండాన్ని ఇండియన్ యూనియన్‌గా, పాకిస్తాన్‌గా విభజిస్తున్నామనీ; రెండింటికీ 'డొమినియన్ స్టేటస్'తోపాటు స్వాతంత్ర్యం ఇచ్చి, బ్రిటిష్ కామన్వెల్త్ దేశాలలో కొనసాగడానికి అనుమతిస్తామనీ ప్రకటించాడు. ఈ రెండు దేశాలలో దేనితోనైనా కలిసిపోవడానికి స్థానిక సంస్థానాలకు స్వతంత్రం ఇస్తున్నట్టు కూడా ఆయన ప్రకటించాడు. భారతదేశ స్వాతంత్ర్యం బిల్లును జూలై 16వ తేదీ బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది. ఆగస్టు 15వ తేదీ స్వతంత్రం ప్రకటించాలని నిర్ణయించారు.

# కొన్ని మొట్టమొదటి విశేషాలు

- 1923వ సం॥ మద్రాసు(చెన్నయ్)లో భారతీయ మహిళాసభ మొట్టమొదటి శిశు సంక్షేమ కేంద్రాన్ని నెలకొల్పింది.
- కలకత్తాలో మొట్టమొదటి సైకిలు ఫ్యాక్టరీ స్థాపించబడింది. (1938)
- భారతదేశంలో మొట్టమొదటి (ప్రపంచంలో రెండవది) బ్లడ్ బ్యాంక్‌ను యు.ఎన్.బ్రహ్మచారి ప్రారంభించాడు. (1939)
- సుప్రసిద్ధ పిల్లల మాస పత్రిక చందమామ ప్రచురణ 1947లో తెలుగు భాషలో ప్రారంభమయింది. క్రమేణా అది పన్నెండు భారతీయ భాషలలో వెలువడసాగింది.
- స్వతంత్ర భారతదేశం 1947 వ సం॥లో భారతీయ పతాకం బొమ్మతో 3½ అణాల మొట్టమొదటి తపాలా బిళ్ళను వెలువరించింది.
- సి.రాజగోపాలాచారి మొట్టమొదటి (ఏకైక) భారతీయ గవర్నర్ జనరల్ పదవిని చేపట్టాడు. (1947)
- జనరల్ కె.ఎమ్.కరియప్ప మొట్టమొదటి భారతీయ కమాండర్- ఇన్-చీఫ్‌గా పదవీ బాధ్యతలు చేపట్టాడు. (1949)

# సర్వ సత్తాక గణతంత్ర రాజ్య (రిపబ్లిక్) అవతరణ

ఆగస్టు 14వ తేదీ జిన్నా గవర్నర్‌జనరల్‌గానూ, లియాఖత్ అలీఖాన్ ప్రధాన మంత్రిగానూ, పాకిస్తాన్ ఏర్పడింది. ఆ నాటి రాత్రి అర్ధరాత్రి సమయంలో జవహర్‌లాల్ నెహ్రూ భారత ప్రజలనుద్దేశించి ప్రసంగించాడు. లార్డ్ మౌంట్ బాటన్ గవర్నర్ జనరల్‌గా, జవహర్‌లాల్‌నెహ్రూ స్వతంత్ర భారతదేశానికి తొలి ప్రధాని అయ్యాడు.



జవహర్‌లాల్ నెహ్రూ

సెప్టెంబర్ 4వ తేదీ ఢిల్లీలో మత కలహాలు చెలరేగాయి. గాంధీజీ నవకాళీనుంచి ఢిల్లీకి వచ్చాడు. అణగారని హింసాకాండకు భయభ్రాంతులై భారత్ నుంచి ముస్లింలు పాకిస్తాన్‌కూ; పాకిస్తాన్ నుంచి హిందువులు భారత్‌కూ తండోపతండాలుగా పారిపోసాగారు.

ఢిల్లీలో శాంతి ఏర్పడినప్పటికీ 1948 జనవరిలో మళ్ళీ హింసాకాండ మొదలయింది. గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించి, శాంతిని కాపాడగలమని హిందూ-ముస్లిం నాయకుల నుంచి హామీ పొంది ఐదవ రోజు ముగించాడు. దురదృష్టవశాత్తు నాథూరాం గోడ్సే చేతుల్లో జనవరి 30వ తేదీ గాంధీజీ ప్రాణాలు కోల్పోయాడు!



గాంధీజీ

1949 నవంబర్ 6వ తేదీ రాజ్యాంగ పరిషత్తు రాజ్యాంగ రచనను పూర్తిచేసింది. పార్లమెంటు దానిని ఆమోదించింది. 1950 జనవరి26వతేదీ నూతన రాజ్యాంగ శాసనం అమలులోకి వచ్చింది.

న్యాయం, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం పునాదులుగా గల సర్వసత్తాక ప్రజాతంత్ర ప్రజాస్వామ్యదేశంగా భారత్ సాధికారంగా ప్రకటించబడింది. సుదీర్ఘ స్వతంత్ర పోరాటం ఫలించింది. భారత ప్రజల అభీష్టం నెరవేరింది.

కాశ్మీరులో అలజడిఆరంభమయింది. అక్కడ అధిక సంఖ్యాకులు ముస్లింలే గాని, పాలకుడు హిందువు. కాశ్మీరు ఇండియన్ యూనియన్‌లో చేరడానికి వ్యతిరేకత బయలుదేరింది. అయినా పాలకుడు ఇండియాలో చేరడానికి ఒప్పందంలో సంతకం చేశాడు. పాకిస్తాన్ నుంచి కిరాయి పఠాన్ దుండగులు కాశ్మీరులోకి దొంగచాటుగా జొరబడ్డారు. అలజడి ఆరంభమయింది. అదే మొట్ట మొదటి ఇండోపాకిస్తాన్ యుద్ధానికి దారితీసింది. 1948 జనవరి 1వ తేదీ ఉభయదేశాలు కాశ్మీరులో యుద్ధ విరమణకు అంగీకరించాయి.

[వచ్చే సంచికలో: ప్రగతి పథంలో స్వతంత్ర భారతం]



# కవి రాయబారం

కాంచనపురాన్ని, కాంచనవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన ప్రజలకు ఎలాంటి కష్టనష్టాలు రాకుండా కాపాడుతూ ప్రజా రంజకుడని పేరు తెచ్చుకున్నాడు. అదు నెరిగి, ఆయన ప్రవేశపెట్టిన సంస్కరణల వల్ల, దేశం సుభిక్షంగా వుండి, ప్రజలంతా ధనధాన్యాలతో తులతూగుతున్నారు.

ఒకనాడు కాంచనవర్మ కొలువు తీరి వుండగా, తిప్పయ్యసెట్టి అనే సుగంధద్రవ్యాల వ్యాపారి అక్కడికి వచ్చాడు. అతడు, రాజుకు నమస్కరించి, "మహారాజా! మీ చల్లని నీడలో మా వర్తకులమందరమూ, ఏ ఒడిదుడుకులు లేకుండా, దేశవిదేశాలలో వర్తకవ్యాపారాలు చేసుకుంటున్నాము. ముఖ్యంగా నేను సుగంధద్రవ్యాలు దిగుమతి చేయించుకుంటాను. జావా ద్వీపం నుంచి, ఒక విశేషమైన అత్తరు వచ్చింది. మహారాజుగారికి ముందుగా సమర్పించడం వర్తకనియమం. కాబట్టి స్వీకరించండి!" అని కాంచనవర్మకు ఒక అత్తరు సీసా ఇచ్చాడు.

రాజు దాని పరిమళానికి ముగ్ధుడై, ఆ అత్తరును కొలువులో వున్నవారి అంగీలకు పులవమని సేవకులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు అలాగే చేశారు. మరుక్షణం కొలువంతా సువాసనలతో నిండిపోయింది.

అప్పుడు, ఆస్థానకవి చంద్రచూడుడు ఆసనం మీదినుంచి లేచి, "తిప్పయ్యసెట్టి తెచ్చినది అత్తరు పరిమళం కాదు; జావా ద్వీపంలో కూడా వ్యాపించిన, మన మహారాజుగారి కీర్తిపరిమళం!" అన్నాడు.

కొలువులోని వారందరూ, కవిమాటలకు హర్షాన్ని వ్యక్తం చేశారు. తిప్పయ్యసెట్టి ఎక్కడలేని ఆనందంతో, "మహారాజా! కవిగారు చెప్పినట్లు, మీ కీర్తి పరిమళమే, నా సుగంధవ్యాపారానికి మూలస్తంభం! కవి మాటలు శిరోధార్యం," అన్నాడు.

డా. జొన్నలగడ్డ మార్కండేయులు

చాలాకొద్దిసేపటిలోనే, కొలువులో జరిగిన ఈ విశేషం, అంతఃపురమంతా వ్యాపించింది. మహారాణి మొదలు, పరిచారిక వరకు తిప్పయ్యసెట్టి అత్తరు పరిమళాన్ని మెచ్చుకున్నారు. అంతేకాదు; నాటినుంచి, కాంచన వర్మ పరిమళం అన్నపేరుతో, కాంచనపురంలో, ఆ అత్తరు విరివిగా అమ్ముడుపోసాగింది.

ఒకనాడు, తిప్పయ్యసెట్టి, ఆస్థానకవిని తన ఇంటికి ఆహ్వానించి, "మహాకవీ! నా అత్తరు పరిమళము ఎంత గొప్పదో తెలియదుగాని, మీరు పలికిన ఒక్క మాటతో, అది మహారాజుగారి కీర్తి పరిమళమైపోయి, నాకు మంచి లాభాలు తెచ్చిపెడుతున్నది. మీ రుణం తీర్చుకోలేనిది!" అని, పట్టుబట్టలు, దక్షిణ ఇచ్చి సత్కరించి, "అయ్యా, చిన్న మనవి! నన్నూ, నా వ్యాపారాన్నీ కీర్తిస్తూ ప్రజల మనసులకు హత్తుకునేలా కవిత్వం రాయండి. నా వ్యాపారవార్తలు ప్రజలు గుమిగూడి చెప్పుకునేలా చేయండి. మీరడిగిన ధనం సంతోషంగా సమర్పించుకోగలను," అన్నాడు.

ఇది వింటూనే చంద్రచూడుడు, వర్తకుడిచ్చిన పట్టుబట్టలూ, దక్షిణా తిరస్కరిస్తూ, "సెట్టీ! కోకిల మావిచిగురు తిని వసంత కాలంలో మాత్రమే గానం చేస్తుంది. అలాగే మంచి కావ్యం రాయాలని కోరిక వున్న కవిని ప్రోత్సహించినవాడిని, కవి కీర్తించగలడు కాని, ఇలా స్వార్థంతో డబ్బు ఇచ్చి తన వ్యాపారాభివృద్ధి కోసం కీర్తించమంటే, కవి కీర్తించడు. తప్పంటే మహారాజును కూడా నడివీధిలోకి లాగి, ప్రజలను చైతన్యవంతులను చేయగలను. నీ వ్యాపార స్వార్థం కోసం, నన్ను పయోగించుకోవాలని చూడకు," అన్నాడు.

ఈ మాటలకు సెట్టి తెల్లబోయాడు.

ఈ విషయం, మహారాజు కాంచనవర్మ చెవిన పడింది. ఆయన కవిని పిలిచి, "మహారాజులో అయినా తప్పంటే నడివీధిలోకి లాగుతానన్నావట! ఈ క్షణాన నిన్ను చెర



సాలలో వేయించగలను. నన్నేమైనా చేయ గలవా?'' అన్నాడు కోపంగా.

చంద్రచూడుడు, ఏదో సమాధానం చెప్పే లోపున, మంత్రి కలుగజేసుకుని, ''మహా రాజా! రావణుడు దుర్మార్గుడు, దుర్యోధనుడు దుర్మార్గుడు. వారిద్దరి గుణగణాలనూ కవి చక్కగా చెప్పాడు కాబట్టి, రాముడు దేవుడయ్యాడు. భారతం రాసిన కవి ద్వారా, ధర్మరాజు గొప్పతనం లోకానికి తెలిసింది. అలాగే, కీచకుడిలాంటి స్త్రీలోలుల్ని ఎలా శిక్షించాలో కూడా, ఆయన చెప్పాడు. అలాగే మన ఆస్థానకవి, మంచినే కాదు, చెడుచేసిన వాళ్ళనుకూడా ప్రజలు ఎంత కీర్తిస్తారో అంతగా అసహ్యించుకుంటారని చెప్పే ఉద్దేశంతో అన్న మాట తప్ప, అందులో దురుద్దేశం లేదని భావిస్తున్నాను!'' అన్నాడు.

అవునని కవి, వినయంగా తల ఊపడంతో రాజు శాంతించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళ తర్వాత, వరసగా నాలుగైదు సంవత్సరాలపాటు అతివృష్టి, అనావృష్టి కారణంగా రాజ్యంలో కరువు పరిస్థితులు ఏర్పడినై. వ్యాపారంలో నష్టం వచ్చే పరిస్థితులు రావడంతో, తిప్పయ్య సెట్టి పొరుగురాజ్యానికి వలసపోవడానికి సన్నాహాలు చేయసాగాడు. ఆ సమయంలో పొరుగు దేశం అయిన కళ్యాణదేశపు రాజు శక్తిసింహుడు, కాంచనపురాన్ని ఆక్రమించడానికి ప్రయత్నాల్లో వున్నాడు. ఈ పరిస్థితులలో, రాజు కాంచనవర్మ గత్యంతరం లేక సంధి చేసుకోవాలని నిర్ణయించుకుని మంత్రి సలహా మీద, ఆస్థానకవి చంద్రచూడుడిని, కళ్యాణదేశానికి రాయబారం పంపాడు.



కళ్యాణదేశం రాజు శక్తిసింహుడు, కవిని గౌరవించి, ''రాయబారిని శిక్షించకూడదని శాస్త్రాలు చెబుతున్నాయి. మేము మీ దేశాన్ని, మా రాజ్యంలో కలుపుకోదలిచాం. కవిరాయబారిగా, నీ అభిప్రాయం ఏమిటి? నువ్వు తిట్టినా, మీ దేశాన్ని ఆక్రమించకుండా వదలం!'' అన్నాడు వికటంగా.

చంద్రచూడుడు నవ్వి, ''మహారాజా! నేను ఇంకా నా సందేశం వినిపించకుండానే, మీరు వీరాలాపాలాడారు. మేము దుర్బల స్థితిలో వున్నమాట వాస్తవం. రక్తపాతం లేకుండా లొంగిపోలనుకున్నాం. మీ మాటలు విన్నాను; ఇప్పుడు కాంచనదేశ పౌరుడినైన, నామాటలు వినండి! తలుపులు తెరిచిన ఇంటి లోపలికి కుక్క దూరితే ఏంచేయగలం! ప్రస్తుతానికి తలవంచినా కుక్కను కొట్టినట్టు మిమ్మల్ని, ఏదో ఒకనాడు తరిమితీరగల దేశభక్తులుగా, మా మహారాజు మమ్ములను పాలించాడు,'' అన్నాడు.

శక్తిసింహుడు, ఆ మాటలకు కోపగించు కున్నా, ఇచ్చిన మాట ప్రకారం, రాయబారిగా వచ్చిన కవిని శిక్షించకుండా వదిలివేశాడు. చంద్రచూడుడు తిరిగివచ్చి, రాజు కాంచన వర్మకు జరిగింది చెప్పాడు. శక్తిసింహుడి ప్రలాపాలకు ఉగ్రుడై కాంచనవర్మ, విజ యమో, వీరస్వర్గమో పోరాడితీరాలని నిర్ణ యించుకున్నాడు.

కవి చంద్రచూడుడు, శక్తిసింహుడి ముందు పలికిన దేశభక్తిపూరితమైన పౌరుష వాక్కులు, ప్రజలలో దేశభక్తిని రగులు కొలి పాయి. ప్రాణాలు పోయేవరకూ రాజుకు అండగా నిలబడతామని, వాళ్ళు శపథాలు చేశారు. తిప్పయ్యసెట్టి ఇతరప్రాంతాలనుంచి నిత్యావసర వస్తువులు తెప్పించి, ప్రజలకు చౌకగా అమ్మసాగాడు.

ఈ విధంగా, కాంచనపురం ప్రజలలో వచ్చిన పౌరుషావేశాల సంగతి విన్న, శక్తి సింహుడి రాజ్యంలోని ప్రజలు, ''ఛీ! మన రాజిప్పుడు కాంచనపురం మీదికి దండ యాత్రకు వెళితే, అది తలుపులు బార్లా తెరిచివున్న ఇంటిలోకి, కుక్క జొరబడినట్టే అవుతుంది. రాజు మనదేశం పరువు తీయ కుండా వుంటే బాగుండును!'' అని బాహా టంగా అనసాగారు.

శక్తిసింహుడు, తన దేశప్రజలు ఏమం టున్నదీ తెలుసుకుని సిగ్గుపడి, రాజు కాంచనవర్మకు రాయబారిద్వారా, ''నాకు మీ దేశంపై దురాక్రమణ చేసే ఉద్దేశం లేదు. ఒక పొరుగురాజుగా, కాటక పరిస్థితుల్లో వున్న మీ దేశానికి అవసరం అయినసహాయం అందిస్తాను,'' అని కబురు చేశాడు.

అన్నమాట ప్రకారం శక్తిసింహుడు, రాజు కాంచనవర్మకు సహాయం పంపి, ఆయనకు మంచి స్నేహితుడుగా ప్రవర్తించాడు. కవి చంద్రచూడుడి రాయబారాన్ని ప్రజలు ఎంతగానో మెచ్చుకున్నారు.

ఆస్థానకవి చంద్రచూడుడు, కొద్దికాలం తర్వాత, తమ రాజు గొప్పతనాన్నీ, రాజ్యాన్నీ కీర్తిస్తూ ఒక కావ్యం రాసి, అందులో తిప్పయ్య సెట్టి ఔదార్యాన్ని కూడా ప్రశంసించి, సెట్టిని కూడా కీర్తించాడు.



# మహాభారతం

తనకు రాజ్యం తిరిగి సంప్రాప్తం కావటానికి ముఖ్యకారకుడైన కృష్ణుడికి ధర్మరాజు తన కృతజ్ఞత తెలుపుకుని, అతన్ని స్తుతించాడు. తరవాత ఆయన తన తమ్ములతో, ''నా మూలాన మీరు అరణ్యాలలో చెప్పనలవి గాని కష్టాలు పడ్డారు. ఒక మాదిరివాళ్ళు ఆ కష్టాలకు తట్టుకుని ఉండరు. మీరు ఎంతో ఓర్పు కలిగినవారు గనక, ఆ కష్టాలన్నీ భరించారు. ఇప్పుడు ఎలాగూ మనం రాజ్యాన్ని జయించాం. మీరు కొంత కాలం విశ్రాంతి తీసుకోండి.తరువాత మళ్ళీ కలుసుకుందాం,'' అన్నాడు.

ఆయన ధృతరాష్ట్రుడి అనుమతితో దుర్యోధనుడి భవనాన్ని దాసదాసీ జనంతో సహా భీముడికి నివాసంగా ఇచ్చాడు. అలాగే దుశ్శాసనుడి భవనాలు అర్జునుడికీ, దుర్మర్షణ దుర్ముఖుల ఎత్తయిన మేడలు నకుల సహదేవులకూ ఇచ్చాడు. వాళ్ళు తమ కొత్త ఇళ్ళలో ప్రవేశించారు. కృష్ణుడూ, సాత్యకీ అర్జునుడి ఇంటనే బసచేశారు.

కొద్దిరోజుల అనంతరం ధర్మరాజు కృష్ణుణ్ణి చూడబోయి, ''మాకు రాజ్యమూ, ప్రతిష్ఠా లభించాయి గాని, మేం ధర్మహాని చేశామన్న అనుమానం ఇంకా బాధిస్తూనే ఉన్నది. అందువల్ల నాకు శాంతికరువై మనసు ఏదో చెప్పలేని బాధకు గురవుతున్నది. ఈ అనుమానాన్ని దయచేసి రహితం చెయ్యి,'' అన్నాడు.





కృష్ణుడు కొంచెం సేపు ఆలోచించి, ''నేను భీష్మణ్ణి గురించి ఆలోచిస్తున్నాను.ఆయనకు తెలియని ధర్మం లేదు. అంపశయ్య మీద పడుకుని ఉన్న ఆ భీష్ముడు చచ్చిపోతే ఎంతో జ్ఞానం ఆయనతో నశించిపోతుంది. అందుచేత నువ్వు త్వరగా ఆయన వద్దకు వెళ్ళి నీకు ఉన్న ధర్మసందేహాలు అడిగి, ఆయన నుంచి అనేక విషయాలు నేర్చుకో,'' అన్నాడు.

దానికి ధర్మరాజు, ''ఆయనను గురించి నీకున్న అభిప్రాయమే నాకూ ఉన్నది. నువ్వే మమ్మల్ని ఆ మహానుభావుడి వద్దకు దయ తలచి తీసుకుపో. ఈ స్థితిలో నిన్ను చూడాలని ఆయన కూడా కోరుతూ ఉండవచ్చు,'' అన్నాడు.

కృష్ణుడు తన వెంట ఉన్న సాత్యకితో, ''మనం ఇప్పుడే పాండవులతో కలిసి భీష్మణ్ణి చూడబోతున్నాం. రథం సిద్ధం చేయించు,'' అన్నాడు.

తరవాత కృష్ణుడూ, సాత్యకీ ఒక రథం మీదా; ధర్మరాజూ, అర్జునుడూ మరొక రథం మీదా; భీముడూ, నకుల సహదేవులూ ఇంకొక రథం మీదా ఎక్కి, భీష్ముడు పడి ఉన్న చోటికి వెళ్ళారు. కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ వేరువేరు రథాల మీద వెళ్ళారు.

దారిలో వారికి అయిదు మడుగులు కనిపించాయి. అవి పరశురాముడివి అని కృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు. ఇరవై ఒక్క సార్లు పరశురాముడు భూ ప్రపంచమంతా తిరిగి తిరిగి క్షత్రియులను వెతికి వెతికి చంపి, ఈ మడుగులు వారి రక్తంతో నిండితే, పరశురాముడు ఆ రక్తంతో పితృతర్పణాలు చేశాడట.

పరశురాముడి ఆగ్రహానికి కారణం ఏమిటో తెలియజేయమని ధర్మరాజు కోరిన మీదట కృష్ణుడు పరశురాముడి కథ ఇలా చెప్పాడు:

జహ్నుడు అనే రాజర్షి వంశంలో పుట్టిన గాధి అనే వాడికి సత్యవతి అనే కూతురు కలిగింది. కాని కొడుకులు లేరు. సత్యవతిని భృగుడి కొడుకైన ఋచీకుడికి ఇచ్చి పెళ్ళిచేశారు.

ఋచీకుడు తనకూ, తన మామగారికీ కొడుకులు కలగాలనే ఉద్దేశంతో హవిస్సు తయారుచేసి, దానిని రెండు భాగాలు చేసి, సత్యవతితో, ''ఈ భాగం మీ అమ్మ కిచ్చి, రెండో భాగం నువ్వు తిను. అలా చేస్తే మీ అమ్మకు పరాక్రమవంతుడైన కొడుకు

పుట్టి, క్షత్రియులనందరినీ చీల్చి చెండాడి, రాజు అవుతాడు. నీకు పరమ శాంతుడైన బ్రాహ్మణోత్తముడు పుట్టుతాడు,'' అని చెప్పాడు.

ఇది జరిగిన ఒకటి రెండు రోజులకే సత్యవతి తల్లిదండ్రులు ఋచీకుడి ఆశ్రమానికి, తీర్థయాత్రలు చేస్తూ వచ్చారు. సత్యవతి తన తల్లితో తన భర్త చెప్పిన మాట చెప్పి, రెండు భాగాలుగా ఉన్న హవిస్సును ఆమె చేతికి ఇచ్చింది. సత్యవతి తల్లి తొందర పడి తన కూతురు తినవలసిన భాగాన్ని తాను తిని, తాను తినవలసిన భాగాన్ని తన కూతురికి పెట్టింది.

ఆ సమయంలో అరణ్యానికి వెళ్ళిఉండిన ఋచీకుడు ఇంటికి తిరిగివచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, ''మీ అమ్మ చేసిన పొరపాటు చేత నీ కడుపున మహాక్రూరుడైన క్షత్రియుడూ, మీ అమ్మ కడుపున బ్రాహ్మణుడూ పుడతారు,''అన్నాడు చాలా విచారంగా.

సత్యవతి ఈ మాటకు ఎంతో విచారించి, ''నా కడుపున క్రూరుడుపుట్టడం నేనుభరించలేను.నీ తపశ్శక్తి చేత నా కడుపున క్రూరుడు పుట్టకుండాచూడాలి. వాడి కొడుకు కావలిస్తే క్రూరుడు కానీ,'' అన్నది.

అలాగే చేస్తానన్నాడు ఋచీకుడు.

సత్యవతికి శాంతుడైన జమదగ్నీ, గాధి భార్యకు విశ్వామిత్రుడూ కలిగారు. జమదగ్నికి పరశురాముడు పుట్టాడు. పరశురాముడు పెరిగి పెద్దవాడై గంధమాదనంలో మహాదేవుణ్ణి ఆరాధించి అనేక అస్త్రాలూ, ఒక గండ్ర గొడ్డలీ సంపాదించాడు.



ఇలా ఉండగా, హైహయ వంశానికి చెందిన కృతవీర్యుడి కొడుకు అర్జునుడు అనేవాడు దత్తాత్రేయుడి అనుగ్రహంవల్ల వెయ్యి చేతులు గలవాడై, రాజులందరినీ జయించి, అశ్వమేధయాగం చేసి బ్రాహ్మణులకు అంతులేని దానాలు చేస్తూ అగ్ని దేవుడికి పర్వతారణ్య ప్రాంతాలను దానం చేశాడు. ఆ ప్రాంతాలను అగ్నిదేవుడు తగలబెట్టేటప్పుడు వసిష్ఠుడి ఆశ్రమం కూడా కాలిపోయింది.

అందుకు వసిష్ఠుడు బాధపడి ఆవేశంతో, ''నా ఆశ్రమాన్ని అగ్ని ఎలా ధ్వంసం చేశాడో, నీ చేతులను పరశురాముడు అలా ధ్వంసం చేస్తాడు,'' అని శాపం పెట్టేశాడు. ఈ శాపానికి అర్జునుడు ఏమాత్రమూ జంకలేదు.

పరశురాముడికీ, కార్తవీర్యార్జునుడికీ వైరం ఏర్పడటానికి కారకులు ఆ అర్జునుడి

కొడుకులు. పొగరుబోతులైనవాళ్ళు పరశు రాముడి ఆశ్రమానికి వెళ్ళి, పరశురాముడు లేని సమయంలో అతని హోమధేనువునూ, దాని దూడనూ బలాత్కారంగా తోలుకు పోయారు.అందువల్ల కోపంతో పరశు రాముడు కార్తవీర్యార్జునుడి వెయ్యి చేతులూ నరికి తన గోవునూ,దూడనూ తెచ్చుకున్నాడు.

హైహయులు ఆ పోట్లాటను అంతతో పోనివ్వక, పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో మరొకసారి వచ్చి, జమదగ్ని తల నరికారు. పరశురాముడు మండిపడి, భూమి మీద క్షత్రియుడన్నవాడు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసి, అర్జునుడి కొడుకు లనూ , మనమలనూ మాత్రమే కాక, భూమి పైన క్షత్రియుడు అనేవాడు ఎక్కడ ఉన్నా, పనిగట్టుకుని వెళ్ళి చంపేశాడు.

అంతటితో శాంతుడై పరశురాముడు వనానికి వెళ్ళి తపస్సు చేసుకోసాగాడు. కొన్నాళ్ళు గడిచాక, ఒకసారి విశ్వామిత్రుడి కొడుకు పరావసువు అనేవాడు ఆయన వద్దకు వెళ్ళి, ''క్షత్రియులనందరినీ చంపు తానని ప్రతిజ్ఞ చేశావు గాని,నెరవేర్చుకోలేదు. ప్రతర్దనుడు మొదలైనవాళ్ళు జీవించే ఉన్నారు,'' అన్నాడు.

పరశురాముడు మళ్ళీ ఆయుధాలు ధరించి బయలుదేరి, వృద్ధులనీ, పిల్లలనీ, కడుపులో ఉన్న పిండాలనీ కూడా పాటించ కుండా క్షత్రియులనందరినీ చంపాడు. ఇలా ఇరవైఒక్కసార్లు ప్రపంచంలో ఉన్న క్షత్రియులను హతమార్చి, పరశురాముడు అశ్వమేధయాగం చేసి, భూమినంతా కశ్య పుడికి దానం చేశాడు.



కశ్యపుడు భూమిని దానంగా పుచ్చు కుంటూ, ''రామా, నీకు కూర్చునే మేర మాత్రం చోటు ఇస్తాను. అక్కడే కూర్చుని తపస్సుచేసుకో,'' అన్నాడు.

పరశురాముడు అందుకు సరేనన్నాడు. ఆయన ఆ భూమికంతటికీ బ్రాహ్మణులను రాజులుగా చేసి, తాను తపోవనానికి వెళ్ళాడు. బ్రాహ్మణుల పాలనలో అరాజకం ప్రబలి,బల వంతులు బలహీనులను పీడించసాగారు.

కశ్యపుడు ఈ సంగతి తెలిసి, భూమిని పాలించటానికి క్షత్రియుల కోసం వెతికితే చాలామంది దొరికారు.

కొందరు హైహయులను వారి తల్లులు రహస్యంగా కాపాడారు. పురువంశానికి చెందిన విదూరథుడనేవాడు ఋక్షపర్వతం మీద పెరిగాడు. సౌదాసుడు అనేవాణ్ణి పరా శరుడు కాపాడాడు. శిబి కొడుకును గోవులు



రక్షించాయి. అతనికి గోపతి అన్న పేరు వచ్చింది. ప్రతర్దనుడి కొడుకు వత్సుడనే వాడు బతికాడు. గౌతముడు గుప్తుడు అనే వాణ్ణి కాపాడాడు. బృహద్రథుణ్ణి కోతులు కాపాడాయి. మరుత్తవంశ క్షత్రియ కుమారులను సముద్రం రక్షించింది. ఇలాబతికిన వారంతా శిల్పకారుల జాతులలోనూ, సువర్ణ కారుల జాతులలోనూ జీవిస్తూవచ్చారు.

కశ్యపుడు ఆ క్షత్రియులనందరినీ పిలిపించి, వారికి భూమి ఇచ్చి సక్రమంగా పాలించుకోమని చెప్పాడు. త్వరలోనే భూమి మీద కొత్త రాజవంశాలు వెలిశాయి.

కృష్ణుడు ఇలా చెప్పిన పరశురాముడి కథ విని ధర్మరాజు భీష్ముణ్ణి చూడబోయాడు. అప్పటికి ఉత్తరాయణం ఇంకా యాభైఆరు రోజులున్నది. భీష్ముడు ధర్మరాజును ఊరడిస్తూ, యుద్ధంలో శత్రువులను చంపటం ధర్మవిరుద్ధం కాదనీ, అది క్షత్రియ ధర్మమనీ చెప్పాడు. ఆయన తాను ప్రాణాలతో ఉన్నంత కాలమూ ధర్మరాజుకు అనేక ధర్మాలూ, ధర్మసూక్ష్మాలూ, నీతులూ చెప్పి, చివరకు ప్రాణాలు వదిలాడు.

అప్పుడొక చిత్రం జరిగింది! భీష్ముడి శరీరంలో ఏయే అంగాల నుంచి ప్రాణం పోతున్నదో ఆ అంగాల నుంచి బాణాలు వాటంతట అవే రాలి పడిపోయాయి. చూస్తూండగానే ఆయన శరీరంలో బాణాలన్నీ ఊడిపోయాయి. ఇది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు.

దారుకర్రలూ, గంధద్రవ్యాలూ తెచ్చి పాండవులూ, విదురుడూ చితిపేర్చారు. భీష్ముడికి తెల్లబట్టలు కప్పి, పూలుచల్లారు. భీష్ముడి తెల్లగొడుగును యుయుత్సుడూ, ఆయన చామరాలను భీమార్జునులూ, ఆయన తలపాగాను నకుల సహదేవులూ పట్టుకున్నారు. ధర్మరాజూ, ధృతరాష్ట్రుడూ ఆయన పాదాలు పట్టుకున్నారు. భీష్ముడికి దహన సంస్కారం జరిగింది. అందరూ గంగా తీరం చేరారు. ధర్మరాజు జలతర్పణాలు విడిచాడు.

ఆయన కుప్పకూలిపోయి ఏడుస్తుంటే, కృష్ణుడి ప్రేరేపణతో భీముడు ఓదార్చాడు. అయితే, అన్న దుఃఖం చూసి మిగిలిన పాండవులు కూడా ఏడ్చారు.

అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఊరడిస్తూ, "నూరుమంది కొడుకులనూ, సమస్తాన్నీ పోగొట్టుకున్నందుకు గాంధారి ఏడవాలిగాని నీకు విషాదం దేనికి?యుద్ధంలో రాజ్యం గెలుచుకున్నావు.బాధ్యతలు చాలా

ఉన్నాయి. ఏడుస్తూ కూచోకు,'' అన్నాడు. వ్యాసుడు ధర్మరాజుతో అశ్వమేధయాగం చెయ్యమన్నాడు.

దానికి ధర్మరాజు, ''మహాత్మా, అశ్వమేధ యాగం చేసి ఘనంగా దానం చెయ్యాలి. అల్పదానాలు నాకిష్టంలేదు. గొప్పదానాలు చెయ్యటానికి నా వద్ద ధనం లేదు. ప్రజలు చూడబోతే దీనులూ, పిల్లలూనూ. ఆత్మీయులను కోల్పోయిఏడ్చేవాళ్ళ మీదపన్నులు ఏమని వెయ్యను?'' అన్నాడు.

ధర్మరాజుకు పుష్కలంగా ధనం దొరికే మార్గం వ్యాసుడు చెప్పాడు. పూర్వం మరుత్త మహారాజు యాగం చేసి బ్రాహ్మణులకు గొప్పగా దక్షిణలిచ్చాడు. ఆ బ్రాహ్మణులు ఆ ధనమంతా హిమాలయాల మీద వదిలేశారు. దాన్ని తెచ్చుకుంటే ధర్మరాజుకు ఘనంగా దానం ఇవ్వడానికి చాలుతుందని వ్యాసుడు చెప్పాడు.

ధర్మరాజు మరుత్తుడి కథ వినగోరితే, వ్యాసుడు ఇలా చెప్పాడు :

త్రేతాయుగారంభంలో మనువు వంశాన కరంధముడు అనే రాజు బృహస్పతినే యాజకుడుగా పెట్టుకుని, దీక్షతో నూరు అశ్వమేధాలు చేసి, ఇంద్రుడితో సమానుడనిపించుకున్నాడు.

అతని కొడుకు మరుత్తు తండ్రిని మించినవాడు.అతనుయాగాలు చెయ్య సంకల్పించి, వేలకొద్దీ బంగారుపాత్రలు చేయించాడు. ఆ యజ్ఞంలో పాత్రలేకాక సమస్త ఉపకరణాలూ బంగారంతో చేసినవే. మరుత్తు అనేకమంది రాజులతో కలిసి, హిమాలయానికి ఉత్తరంగా,మేరుపర్వతానికి సమీపాన ఒక చిన్నకొండ మీద యాగాలు చేశాడు.

ఈ యాగాలకు బృహస్పతి యాజకుడు కావలసింది. కాని ఇంద్రుడు మరుత్తు పట్ల ఈర్ష్యగలవాడై బృహస్పతిని వారించాడు. అప్పుడు మరుత్తు బృహస్పతి తమ్ముడైన సంవర్తుణ్ణి యాజకుడుగా పెట్టుకున్నాడు. యజ్ఞం మహావైభవంగా జరిగింది. తరవాత మరుత్తు బంగారం రాసులుగా పోసి, బ్రాహ్మణులకు దానాలు చేశాడు. అయినప్పటికీ ఇంకా ఎంతో మిగిలిపోయింది. ఆ బంగారాన్ని తెచ్చుకోమని వ్యాసుడు ధర్మరాజుకు చెప్పాడు.



# మనదేశం గురించి తెలుసుకుందాం!

## క్విజ్

'నైటింగేల్ ఆఫ్ ఇండియా' అని గాంధీజీ మెచ్చుకున్న సుప్రసిద్ధ కవయిత్రి సరోజినీ నాయుడును గురించి ఈ సంచికలోనే మరొకచోట చదివాం. మరి ఇతర రంగాలలో కూడా ప్రసిద్ధులైన మహిళలను గురించి మనకెంతవరకు తెలుసో ఇప్పుడు చూద్దాం:

1. భారత రాజధాని కాక పూర్వం ఢిల్లీని ఒక మహిళ పాలించింది. ఆమె ఎవరు? ఎంత కాలం పాలించింది?
2. భారతదేశంలో స్థిరపడిన ఒక విదేశీవనిత 'భారతరత్న' 'నోబెల్ బహుమతి' సత్కారాలను పొందారు. ఆమె ఎవరు?
3. ఒక వనిత గౌరవార్థం భారతదేశం ప్రత్యేక నాణాన్ని ముద్రించింది. ఆమె ఎవరు?
4. జవహర్‌లాల్ నెహ్రూ ఏర్పాటు చేసిన తొలి మంత్రి మండలిలో స్థానం పొందిన మహిళ ఎవరు?
5. సుభాస్ చంద్రబోస్ నాయకత్వంలోని 'ఆజాద్ హింద్' ప్రభుత్వంలో పనిచేసిన వనిత ఎవరు?
6. భారత జాతీయ కాంగ్రెస్ తొలిమహిళా అధ్యక్షురాలు ఎవరు?
7. ప్రప్రథమంగా ఒక నటిని రాజ్యసభకు నామినేట్ చేశారు. ఆ నటి ఎవరు?
8. దక్షిణాదికి చెందిన ఒక సుప్రసిద్ధ గాయని 'భక్త మీరా' చిత్రంలో నటించింది. ఆమె ఎవరు?
9. తన తొలి నవలకే 'బూకర్ బహుమతి' పొందిన భారతీయ రచయిత్రి ఎవరు?
10. జ్ఞానపీఠ బహుమతి పొందిన తొలి రచయిత్రి ఎవరు?
11. 'గ్రాండ్ సెలాన్ ఆఫ్ ప్యారీస్'లో ఆసియా(ఇండియా) సభ్యురాలైన తొలి భారతీయ కళాకారిణి ఎవరు?
12. గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం పొందిన భారతీయ గాయని ఎవరు? ఆమె సాధించింది ఏమిటి?

[సమాధానాలు వచ్చే సంచికలో]

ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు!

చిత్రాలు:పాణి

చంద్రవంశానికి చెందిన మహేంద్రదేవుడి పాలనలో చంద్రపురి సుఖశాంతులతో చాలాకాలం వర్ధిల్లింది. రాజ్యానికి సేనాధిపతి రాజుగారి బావమరిది నరేంద్రదేవుడు అసమర్థుడు. రాజుకు సంతానం కలగలేదు గనక, సేనాధిపతి కొడుకు రవీంద్రదేవుడే సింహాసనానికి వారసుడవుతాడని అందరూ అనుకున్నారు. ప్రధానమంత్రి ఆకస్మికమరణం రాజుకు దిగ్భ్రాంతి కలిగించింది. ఆయన గురుకులంలో క్షాత్రవిద్యలనభ్యసిస్తూన్న మంత్రి కుమారుడు ఆదిత్యుణ్ణి రప్పించి, తన ప్రధాన సలహాదారుగా నియమించాడు.

రాజ్యంలో ఉన్నట్టుండి రోజురోజుకూ పెచ్చుపెరిగిపోతూన్న బందిపోట్ల బెడద రాజుకు ఆవేదన కలిగించింది. ఆయన ఒకనాడు సభలో తన బాధను కోపంగా వ్యక్తం చేశాడు.

"ఈ దుర్మార్గాన్ని అరికట్టడానికి ఏమీ చేయలేమా?"

"బందిపోట్లను ప్రాణాలతో బంధించితీసుకు రావాలని ప్రభువులు ఆజ్ఞాపించకుండా ఉన్నట్టయితే, నేను వాళ్ళనెప్పుడో యమలోకానికి పంపి ఉండేవాణ్ణి!"

"ఆదిత్యా! ఆ బందిపోటు దొంగలను పట్టి బంధించే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను."

సేనాధిపతి ఇచ్చిన సంజాయిషీ రాజుకు సంతోషం కలిగించలేదు. ఆయన తన సలహాదారు ఆదిత్యుణ్ణి పిలిపించాడు.

"చిత్తం, ప్రభూ! నేను బాధ్యతలను రేపు చేపట్టడానికి ప్రభువులు అనుమతించాలి. నేను నగరానికి తిరిగివచ్చాక, నన్ను చూడడానికి తొలిసారిగా ఈ రోజే నా చెల్లెలు వస్తున్నది."

"అలాగే! అయితే, రేపే నువ్వాపనిని తప్పకుండా ప్రారంభించాలి."


ఆ నాటి రాత్రి అడవిమార్గం గుండా ఒక మేనా వస్తున్నది. మేనాకు ముందూ, వెనకా కొందరు భటులు నడుస్తున్నారు...


.... దాపులనున్న కొండశిఖరంపై నుంచి ఆ గుంపును ఒకడు చూశాడు.


హఠాత్తుగా...
సంకేత స్వరం!?


క్షణాలలో బందిపోట్లు మేనాను చుట్టుముట్టారు. బోయీలు మేనాను కిందికి దించారు. బందిపోట్లు వారిపై పడ్డారు.


"లోపల ఉన్నవారు రండి, బయటకు!"
"నగలన్నీ తీసివ్వండి!"
"తప్పించుకు పారిపోతున్నాడు. పట్టుకోండి!"


"ఆడవాళ్ళందరూ ఎక్కడ మాయ మయ్యారు?"
"అందరూ పారిపోయారా?"
"గుర్రం మీద ఎవరో వస్తున్నారు."
"ఒక్క స్త్రీ కూడా నా కంట బడలేదు."


బందిపోటు ముఠా విస్మయంతో బెదిరిపోయింది.
"మనం జాగ్రత్త పడాలి."
"మనం వలలో పడ్డామా?"
"ఆ చెట్లపై దాక్కుందాం?"


కొందరు సైనికులు విరిగిన మేనా భాగాలను వెలికి తీసి చూశారు.
"అక్కడ ఎవ్వరూ లేరు."
"లేరు! వాళ్ళు తప్పించుకుని వెళ్ళివుండలేరు!"
"కొందరు పొదలచాటున ఉన్నారు!"


"వాళ్ళందరినీ అలాగే పట్టి బంధించండి! రాజు దగ్గరికి తీసుకువెళదాం."
"ఎవర్రా అక్కడ చెట్లమీద? కిందికి దిగిరండి!"


"బందిపోట్లందరూ పట్టుబడ్డారు. ఒకరితో ఒకరిని తాళ్ళతో బంధించి సైనికులు వాళ్ళను రాజభవనంకేసి నడిపించారు."
ఒహోయ్... హోయ్...


సైనికులూ,బందిపోటు దొంగలూ రాజభవన ద్వారం దగ్గరికి చేరారు.


"బందిపోటు దొంగలు పట్టుబడ్డారని రాజుగారికి తెలియజేయండి. రాజదర్శనం కోసం వచ్చాను."


కాపలాభటులు లోపలికి వెళ్ళినప్పుడు రాజుసేనాధిపతితోమాట్లాడుతున్నాడు.
"అలాగా! చాలా సంతోషం. అతన్ని లోపలికి రమ్మను."


"రాజుగారు తమర్ని లోపలికి రమ్మన్నారు!"


"వాళ్ళందరినీ కారాగారంలో బంధించండి. వాళ్ళ నాయకుడెవడు? వాణ్ణి బహిరంగంగా ఉరి తీయించాలి!"
"వాళ్ళ నాయకుడెవడో నాకు తెలియదు ప్రభూ! అయితే ఇక్కడ జరిగే విషయాలను వాళ్ళకు చేరవేసే మనిషి రాజ భవనంలో ఉన్నాడు. అందువల్లే వాళ్ళను పట్టుకోవడానికి ఒక తంత్రం పన్నాను!"


బందిపోట్లను కారాగారం కేసి నడిపించారు. ఆదిత్యుడు వాళ్ళలో ఒకణ్ణి గుర్తుపట్టాడు.


"వీరభద్రా!"
"అవును, బాబూ! నువ్వు ఇప్పుడు మమ్మల్ని పట్టి బంధించావు. అయితే, నువ్వు చంద్రపురి ప్రజలకు నమ్మక ద్రోహం చేశావు!"
ఇంకావుంది



# హెచ్చరిక!

సోమనాధుడిది చిన్న కుటుంబం. భార్య కుసుమ అనుకూలవతి. కొడుకు రాజు పట్నంలో చదువుకుంటున్నాడు. కూతురు మాలతి పెళ్ళీడుకు వచ్చింది.

ఒకరోజున భార్యాభర్తలిద్దరూ ఇంటి విషయాలు మాట్లాడుకుంటున్నారు. కుసుమ కాస్త కలవరపడుతూనే, "అన్ని వైపులా ధరలు పెరుగుతున్నాయి. అబ్బాయి పట్నం చదువుకు బాగా ఖర్చవుతున్నది. అమ్మాయికి పెళ్ళి సంబంధం కుదిరిందంటే, చాలా డబ్బే కావలసివుంటుంది. మనం పొదుపుగా వుండడం నేర్చుకోవాలి," అన్నది.

"నీవంటి భార్య వుంటే పొదుపుకేం కష్టం!" అన్నాడు సోమనాధుడు నవ్వుతూ.

అదే సమయంలో వీరయ్య వారిని చూడ వచ్చాడు. వీరయ్యది గోపాలపురం. అక్కడ సోమనాధుడికి పదెకరాల పొలమున్నది. దానిలోనే కొంతమేర వరి, కొంతమేర అరటి, మామిడి, కొబ్బరి, వేరుసెనగ వగైరా పంటలు పండించి, అవి అమ్మగా వచ్చిన డబ్బులో కొంత తనుంచుకొని, కొంత సోమనాధుడికి తెచ్చి ఇస్తూంటాడు, వీరయ్య.

వీరయ్య, సోమనాధుడితో, "అయ్యా! ఈ ఏడాది మన అదృష్టమే అదృష్టం. పట్టిందల్లా బంగారమైంది. వర్తకులు గత సంవత్సరం పెట్టిన బకాయిలు కూడా తీర్చేశారు. మాసం రోజుల్లో తమకు అయిదువేల రూపాయలు అదనంగా తెచ్చిస్తాను," అని చెప్పాడు.

"చాలామంచి కబురు చెప్పావు, వీరయ్యా! ఈ రోజు మా ఇంట్లో విందు భోజనం చేసి వెళ్ళాల్సిందే!" అన్నది కుసుమ.

"లేదమ్మా, అవసరమైన పనిమీద ఇక్కడికి వచ్చాను. నా కూతురుకు పెళ్ళి కుదిరింది. వెంటనే రెండువేల రూపాయల

శ్రీరామ కమల్



బంగారు గొలుసు ఒకటి చేయించాలి. నెల రోజుల్లో మీకు మీ డబ్బిచ్చేటప్పుడు, నా బాకీ కూడా తీర్చేస్తాను. ఎలాగో అలా నాకు మీరు రెండువేలు సర్దాలి,'' అన్నాడు వీరయ్య.

వీరయ్య నమ్మకమైనవాడు. ప్రాణం పోయినా మాట తప్పడు. అందువల్ల, అత డడిగిన డబ్బు అప్పుగా ఇవ్వడానికి, సోమ నాధుడికి అభ్యంతరమేమీ లేదు. అయితే, అప్పుడతనివద్ద ఇంటి ఖర్చులకుగాను రెండు వందల రూపాయలు మాత్రం వున్నాయి.

భర్త సందిగ్ధాన్ని గ్రహించిన కుసుమ కనుసైగలతో అతణ్ణి లోపల మరొక గదిలోకి తీసుకువెళ్ళి, ''వీరయ్య అవసరం నిజమైనది. ఎక్కడినుంచయినా అప్పయినా తెచ్చి, అతడి అవసరం తీర్చాలి. అతడినిలాంటప్పుడు ఆదుకోవడం మన ధర్మం,'' అన్నది.

అప్పెవరినడగాలా అని ఇద్దరూ ఆలో చనలోపడగా, చటుక్కున కుసుమకే సుబ్రహ్మణ్యం గుర్తుకువచ్చాడు. నిన్ననే ఆయనకు అనుకోకుండాపదిహేనువేల రూపాయలు వచ్చాయన్న వార్త ఊరంతా గుప్పుమన్నది.

''చిత్రం,మనకూ అనుకోకుండాఅయిదు వేల రూపాయలు అదనంగా రానున్నాయి. చాలాకాలంగా నేనూ ఒక నగ చేయించు కోవాలనుకుంటున్నాను. అమ్మాయి పట్టు పరికిణీ అని మనసు పడుతున్నది. అబ్బాయి దేవుడిబొమ్మవున్న వెండిఉంగరం కావాలని ఎన్నోసార్లు అడిగాడు. అవన్నీ తీరే సమయం వచ్చింది! సుబ్రహ్మణ్యంగారుమనకులేదనరు. ఎలాగూ అడుగుతున్నారు కాబట్టి, ఏకంగా అయిదువేలు అప్పు చెయ్యండి, మన సరదాలూ తీరతాయి. వీరయ్య అవసరమూ తీరుతుంది,'' అన్నది కుసుమ.

సరేనన్నాడు సోమనాధుడు. ఈలోగా వీరయ్య ఊళ్ళోని నగల దుకాణానికి వెళ్ళాడు. సోమనాధుడు,సుబ్రహ్మణ్యంఇంటికి వెళ్ళాడు.

అప్పటికే ఆయన ఇంటిముందు చాలా మంది వున్నారు.ముఖాలు చూస్తూంటే, వాళ్ళూ అప్పు అడగడానికే వచ్చినట్లు కన బడ్డారు. ఆయనకు అనుకోకుండా డబ్బు వచ్చినందుకు అంతా అభినందిస్తున్నారు. కానీ, మనసులో అప్పెలా అడగాలా అనే ఆలోచన, వాళ్ళను తికమక చేస్తున్నట్లుంది.

సుబ్రహ్మణ్యం విషయం ఇట్టే అర్థం చేసుకున్నట్లున్నాడు. ఆయన అందరివంకా ఒకసారి చూసి, ''డబ్బు సంపాదించడం కష్టం; ఖర్చు చేయడం సులభం. డబ్బున్నప్పుడు మనిషి ఈ విషయం మర్చిపోతుంటాడు. అలా మర్చిపోకుండా వుండడానికి నేను, నా డబ్బును వడ్డీవ్యాపారి సుందరయ్యకిస్తాను. ఆయన నా డబ్బుకు వడ్డీ ఇస్తాడు. ఒక వేళ నాకు డబ్బు అవసరం అయితే, సుందరయ్య దగ్గరే అప్పు తీసుకుంటాను. నా డబ్బు కొంత తన దగ్గర వుంది కాబట్టి, ఆయన ఏ హామీ అక్కర లేకుండా అప్పిస్తాడు. అయితే, నాకిచ్చే వడ్డీకంటే తీసుకునే వడ్డీ ఎక్కువ. ఆ తేడా నాకు హెచ్చరికగా వుంటుంది. అందువల్ల నేను అనవసరపు ఖర్చులు చేయను,'' అంటూ ముందరి కాళ్ళకు బంధం వేశాడు.

తన డబ్బును తనే వడ్డీకి అప్పుతీసుకునేవాడిని ఇతరులేం అడుగుతారు? చుట్టూ చేరిన వారంతా ఒక్కొక్కరు చల్లగా జారుకున్నారు. సోమనాధుడికి, సుబ్రహ్మణ్యం వద్ద చనువెక్కువ. అతడి ముఖం చూసి సుబ్రహ్మణ్యం విషయం అర్థం చేసుకుని, ''నీకు డబ్బవసరం వచ్చినట్టుంది. స్నేహితుడి వద్ద మొహమాటపడకూడదు. ఇప్పుడే ఇద్దరం సుందరయ్య వద్దకు వెళదాం. సంవత్సరానికి నూటికి పదిహేను రూపాయలమీద, పదిహేనువేలలోపు ఎంతకైనా నీ కోసం అప్పు తీసుకుని ఇచ్చే బాధ్యత నాది. ఎంత కావాలో చెప్పు!'' అన్నాడు.నూటికి పదిహేను రూపాయల వడ్డీ అనగానే సోమ



నాధుడు గతుక్కుమని, తన అవసరానికి తగినట్టు రెండువేలే చాలన్నాడు.

ఇద్దరూ సుందరయ్య వద్దకు వెళ్ళారు. సుబ్రహ్మణ్యం పదిహేనువేల రూపాయల నగదును సుందరయ్యకిస్తే, ఆయన రసీదు ఇస్తూ, ''సంవత్సరానికి నూటికి పదమూడు రూపాయలు వడ్డీ వస్తుంది నీకు,'' అన్నాడు.

సుబ్రహ్మణ్యం సరేనని, తనకు రెండు వేలు అప్పు కావాలన్నాడు. సుందరయ్య తల ఊపి, ''మామూలుగా సంవత్సరానికి నూటికి ఇరవై తీసుకుంటాను. నా వద్ద డబ్బు దాచుకునే వారి వద్ద మాత్రం పది హేనే తీసుకుంటాను. నీకు తెలుసుగదా!'' అంటూ పత్రాలమీద సంతకాలు చేయించు కుని రెండు వేలూ ఇచ్చాడు.

ఇది చూసి సోమనాధుడి మనసు చివు క్కుమంది. స్నేహధర్మం గురించి మాట్లాడు తూనే, తన దగ్గరున్న డబ్బును వడ్డీకి తిప్పుతూ, స్నేహితుడికి వడ్డీకి అప్పు ఇచ్చాడు సుబ్ర హ్మణ్యం. అయినా అవసరం తనది కాబట్టి, ఆ రెండువేలూ తీసుకుని వెళ్ళి వీరయ్య కిచ్చాడు. నెల రోజుల్లో అన్నప్రకారం వీరయ్య డబ్బు తెచ్చి ఇవ్వగానే వడ్డీ లెక్క కట్టి బాకీ తీర్చడానికి సుబ్రహ్మణ్యం ఇంటికి వెళితే, ఆయన అందులో రెండువేలు మాత్రం తీసుకుని, ''వడ్డీ వ్యాపారిననుకున్నావా? అయినా స్నేహితుడివద్ద వడ్డీతీసుకుంటానా?'' అన్నాడు.

సోమనాధుడు తెల్లబోయాడు. ఆలో చించగా — చేబదులు వల్ల తనకు కలిగే నష్టాన్ని తెలియజెప్పడానికి మాత్రమే సుబ్ర హ్మణ్యం, తనను సుందరయ్య వద్దకు తీసుకు వెళ్ళినట్టు అర్థమైంది. అలా కాకపోతే తను సుబ్రహ్మణ్యాన్ని రెండు వేలకు బదులు అయిదువేలు అడిగి పుచ్చుకుని, అంతగా అవసరం లేని వాటికోసం ఆ డబ్బు ఖర్చు చేసివుండేవాడు.

సుబ్రహ్మణ్యం ప్రవర్తన తీరు, తగిన హెచ్చ రిక కావడంతో, సోమనాధుడు, వీరయ్య నుంచి వచ్చిన అదనపు అయిదువేల రూపా యలనూ సుందరయ్య దగ్గర వుంచాలని నిర్ణయించుకున్నాడు.





# రాజుగారి సమస్య

ఒక నగరానికి ఒక రాజు ఉండేవాడు. ఆయన ఏమంత తెలివి తేటలు గలవాడు కాడు. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు రాజుగారి ఇంట పురాణం చదువుతూ, యమలోకం గురించీ, అక్కడ రకరకాల పాపాలు చేసిన వాళ్ళు పొందే కఠిన శిక్షలను గురించీ చదివి వినిపించాడు.

పురాణ శ్రవణం అయిపోయాక రాజు ఆ బ్రాహ్మడితో, ''శాస్త్రుల్లుగారూ, మీకు స్వర్గ నరకాలను గురించి ఇంత తెలుసు కదా, ఒక్కఅనుమానం తీర్చండి! మనకు తెలిసినంత వరకు పైన ఆకాశం ఉన్నది, కింద భూమి ఉన్నది. ఈ భూలోకంలో అనేక విధములైన ప్రాణులున్నాయి. వీటిలో కొన్ని స్వర్గానికీ, మరికొన్ని నరకానికీ ఎలాపోతాయి? ఈ విషయం కొంచెం వివరించి చెప్పగలరా?'' అన్నాడు.

ఈ ప్రశ్నవిన గానే బ్రాహ్మడుముందు ఆశ్చర్యపోయి, తరవాత భయపడ్డాడు.సమాధానం చెప్పలేకపోతే రాజు ఏం చేస్తాడోనని భయం!

''మహారాజా,తమరడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే మరొక్కసారి శాస్త్రాలన్నిటినీ పరిశీలించవలసి ఉంటుంది. నాకు కొంచెం వ్యవధి ఇవ్వండి,'' అని చెప్పి,అక్కడి నుంచి జారుకున్న ఆ బ్రాహ్మడు ఆ రాత్రే తన గ్రామానికి పారిపోయాడు.

మర్నాడుదయం రాజుగారు బ్రాహ్మడు పారిపోయిన సంగతి తెలుసుకుని, తన ప్రశ్నకు సమాధానం చెప్పలేకనే పారిపోయాడని ఊహించాడు. తన ప్రశ్న చాలా గొప్పది అయిఉంటుందనుకుని ఆ రాజు కనబడ్డ వారినందరినీ మాటిమాటికీ అదే ప్రశ్న అడగ సాగాడు.

త్వరలోనే రాజ్యంలో అందరికీ ''రాజు గారి సమస్య'' గురించి తెలిసిపోయింది.

పురాణం చెప్పే బ్రాహ్మడికి ఒక కొడుకు ఉండేవాడు. వాడు వట్టి రాలుగాయ. అస్తమానూ తల్లిని వేధించుకు తినేవాడు. ఒక నాడు ఆమె గోధుమలు విసురుతూండగా కొడుకు వచ్చి వేధించాడు.



''వెధవా, అవతలికిపో. ఆ రాజుగారి సమస్య నీకు వచ్చినా బాగుండేది!'' అన్నది తల్లి విసుక్కుంటూ.

''అరరే,సమస్యలు సామాన్యులమైన మనబోటివాళ్ళకే కాకుండా రాజుగారికి కూడా వస్తాయా? మరీ విచిత్రంగా ఉందే! అయినా ఏమిటా సమస్య?'' అని కొడుకు అడిగాడు, తల్లి కెదురుగా కూర్చుని తాను కూడా తిరగలి విసురుతూ.

''మనకు కనబడేది పైన ఆకాశమూ, కింద భూమీ మాత్రమే గదా, ఈ భూమి మీద కోట్ల సంఖ్యలో ఉండే ప్రాణులు కొన్ని స్వర్గానికీ, మరికొన్ని నరకానికీ ఎలా పోతున్నాయో రాజుగారికి ఎవరన్నా చెప్పాలట. అదీ రాజుగారి సమస్య,''అంటూ బ్రాహ్మడి భార్య తిరగలిపైరాయి ఎత్తి చూసింది.

అప్పుడు తిరగట్లో కొన్నిగింజలు నలిగి ఉండటమూ, మరికొన్ని నలగకుండా ఉండటమూ బ్రాహ్మడి కొడుకు పరిశీలించి చూశాడు.

వెంటనే వాడి కేదో తట్టింది. వాడు అప్పటికప్పుడే బయలుదేరి సరాసరి రాజభవనం దగ్గరికి వెళ్ళి, ''నాకు రాజుగారి దర్శనం కావాలి,'' అని ద్వారపాలకులను అడిగాడు.

వాడి అవతారం చూసి, ''రాజుగారు నీ బోటి వాళ్ళకు దర్శనం ఇవ్వరు,'' అన్నారు ద్వారపాలకులు.

''నేను రాజుగారి సమస్య తీర్చటానికి వచ్చాను. ఈ మాట రాజుగారికి చెప్పండి,'' అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

తన సమస్య తీర్చేవాడు వచ్చాడనగానే రాజు బ్రాహ్మడి కొడుకును లోపలికి రానివ్వ

మని ఆజ్ఞయిచ్చాడు. కాని తీరా వాడి వాలకం చూశాక రాజుగారికి వాడి పట్ల నమ్మకం చిక్కలేదు.

"నా సమస్య నీకు సరిగా అర్థమయిందా? నువ్వు నిజంగా సమాధానం చెప్పగలవా?" అన్నాడు రాజు వాడితో.

"నోటితో చెప్పటం కాదు. ప్రభువులు అనుమతిస్తే ప్రత్యక్షంగా చూపిస్తాను," అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

రాజుగారు వెంటనే తన ప్రధాన సభికులందరితో సభ తీరి, బ్రాహ్మడి కొడుకును తన సమస్యకు సమాధానం చెప్పమన్నాడు.

"ఒక తిరగలీ, ఇన్ని గోధుమలూ తెప్పించండి," అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

తిరగలీ, గోధుమలూ వచ్చాయి. బ్రాహ్మడి కొడుకు పట్టెడు గోధుమలు తిరగట్లో పోసి విసురుతూ, "చూడండి, మహారాజా! ఈ పైన తిరిగే రాయి ఆకాశం. కింద కదలకుండా ఉండేరాయి భూమి. ఇందులో పోసిన గోధుమలు జీవరాసులు. పోసేవాడు భగవంతుడు. ఈ చేతి అయిదువేళ్ళూ పంచ భూతాలు, తిరగలిపిడి యమధర్మరాజు. పాపులను ఇలా హింసిస్తాడు," అంటూ పై రాయి ఎత్తి, "చూశారా, మహారాజా? చాలా గింజలు నలిగి యమయాతన అనుభవించాయి. కాని కొన్ని గింజలు చెక్కుచెదరకుండాఉండిపోయాయి. ఇవి యమలోకాన్ని తప్పించుకున్న జీవులు! వాటికి నరక భయం లేదు!" అని ముగించాడు.

రాజు పరమానందం చెంది, "ఆహా! ఎంత జ్ఞానివి! నువ్వు ఎవరి కొడుకువు, నాయనా?" అని అడిగాడు.

వాడు తాను పురాణం చదివే బ్రాహ్మడి కొడుకునని చెప్పాడు.

"నీ తండ్రి కన్న నువ్వే గొప్పవాడివి!" అని చెప్పి, రాజుగారు వాడికి దుశ్శాలువలూ, కట్నాలూ ఇచ్చి, సన్మానించి పంపేశాడు. ఈ సన్మానం ఫలితంగా బ్రాహ్మడి కొడుకు రాలుగాయ లక్షణాలు మాని, పెద్దమనిషిగా జీవించసాగాడు.





# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

## అభినందనలు



డిసెంబర్ 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు :

బొడ్డపాటి రాజేశ్వరమూర్తి
20/304, బ్రహ్మపురం
మచిలీపట్నం- 521002 (ఆం.ప్ర)



మొదటి ఫోటో : అన్నదాతకు వరం!
రెండవ ఫోటో: అవనిమాతకు శాపం!!















# 'పరోపకారి పాపన్న' కథలు

1964–1967 మధ్య 'చందమామ'లో ఆబాల గోపాలాన్ని అలరించిన 'పరోపకారి పాపన్న' ఇకపై బుల్లితెరపై వారం వారం కమ్మని కథలతో మీ ముందుకు వస్తున్నాడు.







ఫిబ్రవరి 1, నుండి
ప్రతి గురువారం రాత్రి 7-30 గంటలకు
హైదరాబాదు దూరదర్శన్ (డిడి1)లో
ప్రసారం!

ఇది వి.యస్.ఎన్. కమ్యూనికేషన్స్ వారి కానుక!

